## విశేష 'ప్రజాదరణ' పొందిన మా ప్రచురణలు

**యర్రా సత్యనారాయణ, B.Sc., B.Ed. గారి...**

- లేటెస్ట్ జనరల్ నాలెడ్జ్ 15/-
- క్విజ్ పవర్ 15/-
- కాంజుగేషన్ ఆఫ్ వెర్బ్స్ డిక్షనరి 15/-
- కామన్ ఎర్రర్స్ 12/-
- వంటలు-పిండి వంటలు 15/-
- జోక్స్ వరల్డ్ 10/-
- ఏ డిక్షనరి ఆఫ్ ఎడ్జెక్టివ్స్ 15/-
- లెర్నర్స్ డిక్షనరి 12/-
- "స్పీడెక్స్" ఇంగ్లీష్ స్పీకింగ్ కోర్స్ 12/-
- జనప్రియ "ఆంగ్లభాష" 15/-
- ఆర్టికల్స్ (A, An & The) 12/-
- స్వయం ఉపాధి (కుటీర పరిశ్రమలు) 15/-
- 'నవభారత్' G.K. 10/-
- 'ఇన్నోవేటివ్' ఇంగ్లీష్ గ్రామర్ 12/-

**అన్నవరపు కుమార్, M.A., M.Phil., B.L., P.G.D.P.R., Ph.D. గారి...**

- S.S.C. (క్లర్క్స్ గ్రేడ్) ప్రీవియస్ & గెస్ పేపర్స్ 12/-
- A.P.P.S.C గ్రూప్ - 1 ప్రీవియస్ & గెస్ పేపర్స్ 12/-
- B.S.R.B. (R.R.B.) ప్రాక్టీస్ పేపర్స్ 25/-
- B.S.R.B. (P.S.Bs) గెస్ పేపర్స్ 18/-

**N. కరుణాకర్, M.A. గారి...**

- ★30 రోజులలో..... ఇంగ్లీష్ నేర్చుకోండి! 12/-
- ★30 రోజులలో.....ఇంగ్లీష్ గ్రామర్ 12/-

**P. నాగేంద్ర ప్రసాద్, B.Sc., B.Ed. గారి...**

- ఇన్ఫర్మేటివ్ ఇంగ్లీష్ గ్రామర్ 12/-
- A.P. హిస్టరీ స్పెషల్ క్విజ్ బిట్స్ 10/-
- క్విజ్ "ఇండియా" 10/-
- పరీక్షలు-ప్రథమ శ్రేణి 10/-
- ★ చక్కని ఇంగ్లీష్ వ్రాయడమెలా? 10/-
- ★ త్రిభాషా డిక్షనరి (తెలుగు-ఇంగ్లీష్-హిందీ) 12/-
- ★ Learner's G.K. 10/-
- ★ గార్డెనింగ్ 10/-

**యర్రు కృష్ణార్జునరావు, B.Com. గారి...**

- లాఫ్ జోక్స్ 8/-

**బెల్లూరి సీతారామేశ్వరరావు, B.Com. గారి....**

- ★ నాటి మానవులే- నేటి దేవతలా...! 20/-
- ★ పుట్టుమచ్చల శాస్త్రము 10/-
- ★ శరీరము - వ్యాధులు 12/-
- ★ రాశులను బట్టి.... మీ శృంగార జీవితం 12/-
- ★ "తేనె" తో చికిత్సలు 6/-

**శ్రీమతి Ch. శిరీష గారి....**

- ★ "చికెన్"తో వంటకాలు 6/-
- ★ "ఎగ్"తో వంటకాలు 6/-
- ★ "ఫిష్"తో వంటకాలు 8/-

**S. నాగేంద్రనాథ్‌రావు, M.A., B.Ed. గారి....**

- మెంటల్ ఎబిలిటి 12/-

**అడుసుల రామయాచారి, P.O.L. గారి........**

- ★ తెలుగుపద ప్రయోగాలు (దోషములు - నివారణలు) 15/-
- ★ గృహ వైద్యసారము 10/-
- ★ ఆయుర్వేద పానీయాలు 10/-

**★ స్టార్ మార్క్ ఉన్నవి స్టాక్‌లో లేవు. స్టార్ మార్క్ లేనివి మాత్రమే స్టాక్‌లో ఉన్నవి.**

గమనిక: పై వాటిలో మీకు కావలసిన పుస్తకాల ఖరీదును క్రింది అడ్రసుకు M.O. చేయండి! పైకము మాకు అందగానే సద పుస్తకాలను కేవలము Rs.1-00కి V.P.B.P.లో పంపగలము. ఉత్తర-ప్రత్యుత్తరాలకు రిప్లైకార్డ్ తప్పక వ్రాయా M.O.కూపన్‌లో కావలసిన పుస్తకాల పేర్లు, అడ్రస్ స్పష్టముగా వ్రాయాలి. ఆంధ్ర ప్రదేశ్‌లోని అన్ని R.T.C. బస్‌స్టేషన్ బు స్టాల్స్‌లోనూ, రైల్వే స్టేషన్స్‌లోని హిగ్గిన్ బాథమ్స్ మరియు ప్రైవేట్ బుక్ స్టాల్స్‌లోనూ మా ప్రచురణలన్నీ లభించును.

**జనప్రియ పబ్లికేషన్స్, తెనాలి - 522 201. Phone No. 23037**

# అనుదిన పద్యాలు

'రాష్ట్ర భాషా ప్రవీణ'

"శ్రీ చిత్ర" పురాణపండ

రథంబజారు,

ఆలమూరు-533 233.






☎ 08644-23037




జనప్రియ పబ్లికేషన్స్

అగ్నికుల క్షత్రియుల వారి వీధి-II,

గంగానమ్మపేట, తెనాలి-522 201.

# విషయ సూచిక

## హనుమద్వైభవము — వెల : Rs. 18-00

**(మారుతి మహిమలు)**

భక్తుల ఆపదలు తొలగించిన కథలు, షోడశోపచార పూజ, ఆంజనేయ దండకము, అష్టోత్తర స్తోత్రము మొ॥గు విశేషములు గల 'నిత్యపారాయణ గ్రంథము!'

---

## హనుమద్విజయము — వెల : Rs. 20-00

వానర జనన గాథ, హనుమజ్జననము, విద్యాభ్యాసము, సుందర కాండ మరియు పరాశర సంహితలోని 'నిత్యపూజా విధానము' తో కూడియున్న 'పారాయణ గ్రంథము!'

---

## షిర్డి సాయినాథ చరిత్ర — వెల : Rs. 18-00

మహిమలు, పూజలతో కూర్చిన 'నిత్య పారాయణ గ్రంథము!'

---

## స్తోత్ర ప్రభాకరము — వెల : Rs. 12-00

సర్వకార్యములు సిద్ధించి- ధనప్రాప్తి, విద్యా విజయము కలుగుటకు- ఎల్లవారలు పఠించదగిన 'మహత్తర స్తోత్ర రాజములు!'

---

పై వాటిలో.... కావలసిన పుస్తకముల ఖరీదును- "జనప్రియ పబ్లికేషన్స్, తెనాలి-522 2001"కి M.O. ద్వారా పంపగలరు.

## అధ్యాయము—1

శ్రీ హరిః

# అనుదిన ధర్మాలు

## సదాచార పాలనము

శ్లో॥ ఆచారః పరమోధర్మః సర్వేషామితి నిశ్చయః ।
హీనాచార పరీతాత్మా ప్రేత్య చేహ చ నశ్యతి ॥
[వశిష్ఠ స్మృతిః]

మానవమాత్రునకు సదాచార పాలనము పరమధర్మమైనదిగా చెప్పబడినది. అచార హీనమై నందువల్ల...కలుషితమై అంతఃకరణ గల మానవుడు ఇహపర లోకములందు దుర్గతినే పొందుతాడు!

శ్లో॥ ఏవమాచారతో దృష్ట్వా ధర్మస్య మునయో గతిమ్,
సర్వస్య తపసో మూలమాచారం జగృహుః పరమ్ ॥
[మనుస్మృతిః]

దివ్యదృష్టి సంపన్నులైన ఋషులు సదాచార పరిపాలన వల్లనే ధర్మం సిద్ధిస్తుందని తెలిసికొని... సమస్త తపస్సులకు మూలమైన సదాచారాన్నే సర్వోత్కృష్టమైనదని యెంచి; దృఢ విశ్వాసంతో ఆ సదాచారాన్నే స్వీకరించినారు!

శ్లో॥ శృతి స్మృత్యుదితం ధర్మమను తిష్ఠన్హి మానవః ।
ఇహ కీర్తి మవాప్నోతి ప్రేత్య చానుత్తమం సుఖమ్॥
(మనుస్మృతిః)

వేదములందు, శాస్త్రములందు చెప్పబడిన ధర్మములను యథాతథంగా పాలించిన మానవుడు....ఈ లోకమందు ఉత్తమ యశస్సునూ, మరణానంతరం పరలోకమందు సుఖప్రాప్తినీ పొందగలుగుతాడు.

## శాస్త్ర శ్రవణము

**శ్లో॥ తస్మాదహర హర్వేదం ద్విజోఽధీయీత వాగ్యతః,**
**ధర్మశాస్త్రేతిహాసాది సర్వేషాం శక్తితః పఠేత్ [వ్యాసః॥]**

శాస్త్ర శ్రవణము వలన సదాచార సంపత్తి కలిగి ధర్మకర్మల వివేకం సిద్ధిస్తుంది. అందుచే ఇంద్రియ నిగ్రహంతో, చిత్తశుద్ధితో ప్రతి నిత్యమూ....వేద, శాస్త్ర, ఇతిహాస పురాణాదులను యథాశక్తి అధ్యయనం సాగించడమే బ్రాహ్మణుల కర్తవ్యంగా చెప్పబడింది.

## బ్రాహ్మ ముహూర్తమున లేచుట

**శ్లో॥ బ్రాహ్మే ముహూర్తే బుధ్యేత ధర్మార్థౌ చాను చింతయేత్,**
**కాయక్లేశాంశ్చ తన్మూలా న్వేద తత్వార్థమేవ చ ॥**

**[మనుస్మృతిః]**

తెల్లవారుజామున మేల్కాంచవలెను. ధర్మార్థములనూ, వాటిని సముపార్జించే సమయాన సంభవించే క్లేశాలనూ గూర్చి బాగుగా ఆలోచించవలెను. వేదతత్వము.... అనగా ఈశ్వర స్మరణ చేయవలెను.

**శ్లో॥ యామిన్యాః పశ్చిమే యామే త్యక్తనిద్రో హరిం స్మరేత్,**
**ఆలోక్య మంగళద్రవ్యం కర్మావశ్యక మాచరేత్ ॥**

**[వ్యాసస్మృతిః]**

రాత్రి చివరి ఘడియ యందు నిద్రపోక భగవన్నామ స్మరణమునే చేయవలెను. మంగళమయములగు ద్రవ్యములనే దర్శించి; నిత్యావశ్యక కర్మాచరణయందు నిమగ్నుడు కావలెను.

**శ్లో॥ బ్రాహ్మే ముహూర్తే యా నిద్రా సా పుణ్యక్షయకారిణీ,**
**తాం కరోతి ద్విజో మోహాత్పాదకృచ్ఛ్రేణ శుద్ధ్యతి॥**

**[రత్నావల్యామ్]**

తెల్లవారుజామున నిద్రించినచో పుణ్యం క్షీణిస్తుంది. బ్రాహ్మణులు తెల్లవారుజామున ప్రమాదవశాత్తూ నిద్రించినచో.... ఆ నిద్రవల్ల కలిగే పాపములను పోగొట్టుకొనేందుకు కృచ్ఛ్రవ్రతం ఆచరించవలెను.

రాత్రి చివరి ఘడియలందలి మొదటి రెండు ఘడియలు బ్రాహ్మ ముహూర్త మనీ, తరువాతి రెండు ఘడియలు రౌద్ర ముహూర్త మనీ అంటారు.

## భగవత్స్మరణము

ప్రతినిత్యం బ్రాహ్మ ముహూర్తాన మేల్కాంచి, ఆసనం వేసికొని; మున్ముందుగా భగవన్నామస్మరణ గావించవలెను.

శ్లో॥ త్రైలోక్య చైతన్య మయాద్యదేవ
శ్రీనాథ విష్ణో భవదాజ్ఞయైవ ।
ప్రాతః సముత్థాయ తవ ప్రియార్థం
సంసార యాత్రామనువర్త యిష్యే ॥

ఓ చిత్స్వరూపా పరమాత్మా ! త్రిలోకనాథా! ఆదిదేవా! శ్రీనాథా! విష్ణో! మేము నీ అనుజ్ఞవల్లనే ప్రాతఃకాలాన మేల్కాంచి; నీ ప్రీతి కొరకు నీవు చెప్పిన మార్గాన్నే జీవయాత్రను సాగిస్తున్నాము.

## కర దర్శనము

శ్లో॥ అయం మే హస్తో భగవాన్ అయం మే భగవత్తరం,
అయం మే విశ్వస్య భేషజోఽయం శివాభిమర్శనః ॥
[ఋ. 10-60-12]

ప్రాతఃకాల సమయాన తన అరచేతిని చూచుకోవడం మంగళమయమని అంగీకరిస్తారు "చేయి భగవంతుని విభూతి [ఐశ్వర్యం]. ఈ నా చేయి భగవంతుడు. ఇది భగవత్తరమైనది. ప్రపంచమందలి క్లేశాలకు ఔషధము వంటిది. కళ్యాణములను ప్రాప్తింపజేస్తుంది. చేతులతో పనులు చేసి మనము ధనము సంపాదిస్తున్నాము. చేతులతో అక్షరాలు నేర్చుకొని విద్యనభ్యసిస్తున్నాము. చేతులతో మాలను ధరించి భగవన్నామము జపిస్తున్నాము. జపము వల్ల భగవదనుగ్రహం సంపాదిస్తున్నాము.

ఆ కారణం చేత భగవత్ స్మరణానంతరము ఈ క్రింది శ్లోకం చదివి కరదర్శనం చేయాలి.

శ్లో॥ కరాగ్రే వసతే లక్ష్మీః కరమధ్యే సరస్వతీ ।
కరమూలేతు గోవిందః ప్రభాతే కరదర్శనమ్॥

కరాగ్రభాగాన లక్ష్మి నివసిస్తుంది. కరమధ్య భాగాన సరస్వతి నివసిస్తుంది. కరమూల భాగాన శ్రీహరి నివసిస్తాడు. కనుక.... ప్రాతః కాలాన కరదర్శనం మంగళములను కలుగజేస్తుంది. కాబట్టి.... ప్రతి ఒక్కరు ఈ ఆచరణ ద్వారా శుభములను పొందవచ్చును

భూమి వందనము

శ్లో॥ భూమే మాతర్ని దేహి మా భద్రయా సుప్రతిష్ఠితమ్,
సంవిదానా దివా కవే శ్రియాం మా దేహి భూత్యామ్ ॥

[అథర్వ 12-1-63]

కరదర్శనానంతరం భూమిపై కాలు పెట్టక పూర్వమే ఒక్కసారి భూమాతకు నమస్కరించవలెను. ఆమె మనలను ధరించి పోషించు మాత! వేదములు కూడ ఆమెకు నమస్కారం చేస్తాయి!! " ఓ మాతా! నన్ను కల్యాణ కారకములైన ప్రతిష్ఠయందు సుప్రతిష్ఠుణ్ణి చేయి. ఓ కవి! నాకు స్వర్గప్రాప్తిని కలుగజేయి. నన్ను లక్ష్మి విభూతులందు స్థాపన చేయి!" అని అధర్వణవేదం చెపుతోంది.

భూమాతను పదములతో స్పృశించడం ఉచితం కాకపోయినా .... మనకది ఏమంత పాపాచరణ కార్యం కాదని ఆర్యులు చెపుతున్నారు. ఏది ఏమైనా.... భూమిపై పాదాలు ఉంచుతూ, క్షమించమని భూమాతను యాచించవలెను.

శ్లో॥ సముద్ర వసనే దేవి పర్వత స్తనమండితే ,
విష్ణుపత్ని నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వమే ॥

ఓ దేవీ ! సముద్రములు నీ వస్త్రములు. పర్వతములు స్తనములు. ఓ విష్ణుపత్నీ ! నీకు నమస్కారములు. నేను నా పాదములు నీపై మోపుచున్నందుకు క్షమించుము.

## ముఖ ప్రక్షాళనము

భూ వందన మాచరించిన తరువాత పక్కమీద నుండి క్రిందికి దిగి, లఘుశంక ఉన్నట్లయిన ... ముందుగా ఆ శంక నివృత్తి చేసుకోవలెను. ఆ పిమ్మట.... నిర్మల జలాన్ని తీసికొని, ముఖమును బాగుగా పరిశుభ్రపరచుకొని ప్రాతఃస్మరణ చేయవలెను.

## ప్రాతః స్మరణము

శ్లో॥ బ్రహ్మా మురారి స్త్రిపురాంతకారీ భానుః శశీ భూసురో
బుధశ్చ ।
గురుశ్చ శుక్రః శని రాహు కేతవః కుర్వంతు సర్వే
మమ సుప్రభాతమ్॥

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడు, సూర్యచంద్రులు కుజ, బుధ, గురు, శుక్ర, శని, రాహుకేతువులు నా ప్రాతఃకాలమును మంగళమయ మొనర్చెదరు గాక!

శ్లో॥ భృగు ర్వశిష్ఠః క్రతురంగిరాశ్చ మనుః పులహాశ్చ
గౌతమః ।
రైభ్యో మరీచిశ్చ్యవనశ్చ దక్షః కుర్వంతు సర్వే
మమ సుప్రభాతమ్॥

భృగు, వశిష్ఠుడు, క్రతు, అంగిర, మను, పులస్త్య, పులహ, గౌతమ, రైభ్య, మరీచి, చ్యవన దక్షాదులు నా ప్రాతఃకాలమును మంగళ మయ మొనర్తురు గాక!

శ్లో॥ సనత్కుమారః సనకః సనందనః సనాతనోఽ ప్యాసురి
పింగళౌచ ।
సప్తస్వరాః సప్తరసాతలాని కుర్వంతు సర్వే
మమ సుప్రభాతమ్॥

సనత్కుమార సనక సనందన సనాతన, ఆసురి, పింగళ సప్తస్వరములు, సప్త రసాతలములు నా ప్రాతఃకాలమును మంగళమయ మొనర్చుగాక!

శ్లో॥ సప్తార్ణవాః సప్తకులాచ లాశ్చ సప్తర్షయో ద్వీపవనాని సప్త।

భూరాది కృత్వా భువనాని సప్త కుర్వంతు సర్వే మమ సుప్రభాతమ్॥

సప్త సముద్రములు, సప్త పర్వతములు, సప్తర్షులు, సప్త ద్వీపములు, సప్త వనములు, భూమి మొదలగు సప్త భువనములు నా ప్రాతః కాలమును మంగళమయ మొనర్చు గాక !

శ్లో॥ పృథ్వీ సగంధా సరసాస్తథాపః స్పర్శీచ వాయుర్జ్వలితం చ తేజః।

నభః సశబ్దం మహతా సహైవ కుర్వంతు సర్వే మమ సుప్రభాతమ్॥

గంధగుణ యుక్తమైన పృథ్వి, రస గుణమయమైన జలము, స్పర్శగుణము గల వాయువు, రూపగుణ సంపన్నమైన తేజము, శబ్దగుణముతో కూడిన ఆకాశము మహతత్వం : ఇవన్నీ నా ప్రాతఃకాలమును మంగళమయ మొనర్చుగాక!

శ్లో॥ ఇత్థం ప్రభాతే పరమం పవిత్రం పఠేత్స్మరేద్వాశ్శృణు యాచ్చ తద్వత్।

దుఃస్వప్ననాశ స్త్విహ సుప్రభాతం భవేచ్చ నిత్యం భగవత్ప్రసాదాత్॥

ఈ విధముగా.... ప్రాతఃకాలాన పరమ పవిత్రమైన ఈ నామాలను చదివినా, స్మరించినా, విన్నా.... అట్టివాడు భగవత్కృపాపాత్రుడై దుఃస్వప్నాలవల్ల కలిగే దోషాలనుండి విముక్తుడౌతాడు.

శ్లో॥ పుణ్యశ్లోకా నలోరాజా పుణ్యశ్లోకో యుధిష్ఠిరః।

పుణ్యశ్లోకాచ వైదేహి పుణ్యశ్లోకో జనార్దనః॥

పుణ్యశ్లోకులైన నల, యుధిష్ఠిర, జానకి, శ్రీ మహావిష్ణువులను ప్రతినిత్యం స్మరించవలెను.

శ్లో॥ అశ్వత్థామా బలిర్వ్యాసో హనుమాంశ్చ విభీషణః ।
కృపః పరశురామశ్చ సప్తైతే చిరంజీవినః॥
సప్తైతాన్ సంస్మరే నిత్యం మార్కండేయ మథాష్టమమ్,
జీవేద్వర్ష శతంసోఽపి సర్వవ్యాధి వివర్జితమ్॥

అశ్వత్థామ, బలిచక్రవర్తి, వ్యాసుడు, హనుమంతుడు, విభీషణుడు కృపుడు, పరశురాముడు అను ఏడుగురు చిరంజీవులు. చిరంజీవులలో ఎనిమిదవవాడు మార్కండేయుడు. వీరిని సదా స్మరణ గావించిన మానవుడు సర్వరోగరహితుడై వంద సంవత్సరములు జీవిస్తాడు.

శ్లో॥ అహల్యా ద్రౌపదీ సీతా తారా మందోదరీ తథా!
పంచకన్యా స్మరే న్నిత్యం మహాపాతక నాశనమ్॥

అహల్య, ద్రౌపది, సీత, తార, మండోదరి : ఈ అయిదుగురినీ ప్రతినిత్యం స్మరించిన మానవుని పాతకాలు నశిస్తాయి.

శ్లో॥ రామ లక్ష్మణా సీతాచ సుగ్రీవో హనుమాన్ కపిః ।
పంచై తాన్స్మరతో నిత్యం మహాబాధా ప్రముచ్యతే॥

రామలక్ష్మణులను, సీతను, సుగ్రీవుని, హనుమంతుని : ఈ అయిదుగురినీ నిత్యం స్మరించినచో బాధలు తొలగును.

శ్లో॥ అయోధ్యా మధురా మాయా కాశీ కాంచీ అవంతికాః ।
పురీ ద్వారావతి చైవ సప్తైతే మోక్షదాయికాః ॥

అయోధ్య, మధుర, మాయ, కాశి, కాంచీపురము, అవంతిక, ద్వారావతి : ఈ ఏడు నగరాలు మోక్షములను ప్రసాదించునవి.

## శౌ చా చా ర ము

మానవుడు నిర్మలమైన మనస్సుతో, ప్రసన్న హృదయంతో విధి విధానంగా శౌచాచారమందు ప్రవృత్తుడు కావలెను.

శ్లో॥ శౌచే యత్నః సదా కార్యః శౌచమూలో ద్విజః స్మృతః।
శౌచాచార విహీనస్తు సమస్తా నిష్ఫలాః క్రియాః ।

శౌచాచార పాలన సర్వసామాన్యమైన ధర్మముగా చెప్పబడినది. విశేషించి బ్రాహ్మణులు శౌచాచారమును పరిపూర్తిగా ఆచరించవలెను. శౌచాచారం నిర్వర్తించని పురుషుడు శాస్త్రీయ క్రియలు ఎన్ని ఆచరించినా.... అవి నిష్పలములే అవుతాయి.

శ్లో॥ శౌచంతు ద్వివిధ ప్రోక్తం బాహ్య మాభ్యంతరం తథా।
మృజ్జలాభ్యాం స్మృతం బాహ్యం భావశుద్ధిరథాంతరమ్॥

బాహ్యాభ్యంతరములని శౌచము రెండు విధములు. జల, మృణ్మయములతో బాహ్య శౌచమూ, భావశుద్ధివల్ల అభ్యంతర శౌచము సిద్ధిస్తుంది.

శ్లో॥ అశౌచాద్ధి వర బాహ్యం తస్మాదాభ్యంతరం పరమ్।
ఉభాభ్యాం తు సుచిర్యస్తు న శుచిర్నేతరః శుచిః ॥

పూర్ణ శౌచాచారము మానివేయుటకంటె బాహ్యశౌచమైనను చేయుట ఉత్తమము. బాహ్యశౌచము కన్న మిన్న ఐనది అభ్యంతర శౌచాచారం. బాహ్యాభ్యంతర శౌచరములను పాలించేవాడే పవిత్రుడుకాని, తదన్యుడు పవిత్రుడు కాజాలడు.

శ్లో॥ మృదా తోయేన శుద్ధిః స్యాన్న క్లేశో న ధన వ్యయః।
యస్మ శౌచేపి శైథిల్య చిత్తం తస్య పరీక్షితమ్॥

(దక్షస్మృతిః)

బాహ్యశౌచము జలమృణ్మయాలవల్ల సిద్ధిస్తుంది. అదేమంత కష్టసాధ్యమైనదీ, ఖర్చు చేయవలసినదీ మాత్రము కాదు. శౌచాచారం చేయుటలో ఇద్దకం చూపరాదు చిత్తము నిర్మలమైనదీ, కానిదీ ఈ శౌచాచార పరీక్ష వల్లనే తెలుస్తుంది.

శ్లో॥ అభక్ష్య పరిహారశ్చ సంసర్గశ్చాప్య నిందితైః।
ఆచారేషు వ్యవస్థానం శౌచమిత్యభిధీయతే॥(అత్రిస్మృతిః)

అభక్ష్యము పరిత్యజించుట, నిరంతరము అనిందనీయ పురుషులను అనుసరించుట, శాస్త్రోక్త స్వధర్మాచారమందు మనస్సును లగ్నము చేయుట "శౌచాచార" మని అత్రిమహర్షి చెప్పారు.

## చేయవలసిన విధి

శ్లో॥ శౌచేతు సుఖమాసీనః ప్రాఙ్ముఖో వాప్యుదఙ్ముఖః।
శిరః ప్రావృత్య కర్ణం వా ముక్త కచ్ఛ శిఖోఽపి వా॥
(ఔశనస్మృతిః)

ఒక పెద్ద పాత్రనిండా నీరు, కొంచెం శుద్ధమైన మృణ్మయాన్ని తీసుకొని శౌచం నిమిత్తం వెళ్లవలెను. యజ్ఞోపవీతమును చెవులపై ఉంచుకొని, శిరస్సుపై ఒక శుభ్రమైన వస్త్రమును బంధించు కొనవలెను. కచ్ఛశిఖాగ్రంథులను విప్పి, తూర్పు లేకఉత్తర దిశలవైపు ముఖము నుంచి, సుఖపూర్వకముగా కూర్చొని, మలాన్ని విడిచిపెట్టవలెను.

శ్లో॥ ప్రత్యఙ్ముఖస్తు పూర్వాహ్నే ఉపరాహ్నే ప్రాఙ్ముఖస్సదా
ఉదఙ్ముఖస్తు మధ్యాహ్నే నిశాయాం దక్షిణాముఖః॥
[యమః]

శౌచసమయాన ప్రాతఃకాలం పశ్చిమంవైపు ముఖముంచి, మధ్యాహ్నం ఉత్తరదిశగా ముఖముంచీ, రాత్రి దక్షిణ ముఖంగానూ కూర్చోవలెను.

శ్లో॥ తిష్ఠన్న మూత్రపురీషే కుర్యాత్ [పారస్కర గృహ్యసూత్రే]

ఉభే మూత్రపురీషే తు దివా కుర్యాదుదఙ్ముఖః।
రాత్రౌ కుర్యాద్దక్షిణస్థ ఏవం హ్యాయుర్న హీయతే॥
(వశిష్ఠ స్మృతిః)

పగలు ఉత్తరంగాను, రాత్రి దక్షిణంగాను ముఖమునుంచి, మల మూత్రాదులను విసర్జించిన ఆయువు వృద్ధిచెందునని వశిష్ఠులవారు చెప్పారు.

ఈ నియమం బాహ్య ప్రదేశాన శౌచనివృత్తి కొరకు ఉపయోగిస్తుంది. సూర్యునికి ఎదురుగా కూర్చొని మలమూత్ర విసర్జన కావించుట దోషమని చెప్పబడెను. నిలబడి మలమూత్రములు విసర్జించరాదు. మల మూత్ర విసర్జన కాలములో మౌనముగా నుండవలెను.

శ్లో॥ ఛాయాయా మంధకారే వా రాత్రావహని వా ద్విజః।
యథా సుఖముఖః కుర్యాత్ప్రాణ బాధాభయేషుచ॥
[మనుస్మృతి]

ఇంటిలో ఉండి శౌచాలయమందు మలమూత్రములు విడిచిపెట్టిన వారికి దిక్కుల నియమములు లేవు. పగలుగానీ, రాత్రిగానీ, నీడను గానీ, అంధకారానగానీ, ఆపత్సమయానగానీ యదేచ్ఛగా ఏ వైపు ముఖమునుంచి శౌచం చేసినా బాధలేదు.

శ్లో॥ గృహీత్వా జలపాత్రం తు విణ్మూత్రం కురుతే యది।
తజ్జలం మూత్రసదృశమత శ్చాంద్రాయణం చరేతే॥
[ఆహ్నిక సూత్రావల్యామ్]

మలమూత్ర విసర్జన సమయాన జలపాత్రను మాత్రం చేతితో పట్టుకొనకూడదు. మలమూత్రానంతరమే దానిని తీసికొనవలెను.

శ్లో॥ దశహస్తాన్పరిత్యజ్య మూత్రం కుర్యాజ్జలాశయే।
శతహస్తాన్పరీషార్థే తీరే నద్యాం చతుర్గుణమ్॥
[బౌధాయనః]

జలాశయము నుండి పదిహస్తాల దూరములో [పది గజములు] కూర్చొని మలమూత్ర విసర్జన చేయవలెను.

శ్లో॥ తీర్థే శౌచం న కుర్వీ త కుర్వీతోద్ధృత వారిణా॥
[బౌధాయనః]

జలాశయమునుండి జలమును పాత్రతో తీసికొని, దూరముగ వెడలి; శౌచము చేయవలెను. కొందరు పాత్రను తీసికొనక ఆ తీర్థ మందలి నీటినే వాడెదరు.

శ్లో॥ ప్రత్యగ్నిం ప్రతిసూర్యం చ ప్రతి చద్విజమ్।
ప్రతి సోమోదకం సంధ్యాం ప్రజ్ఞా నశ్యతి మేహతః।
న నద్యాం మేహనం తార్యం నభస్మని న గోమయే।
న వాకృష్టే న మార్గే చ నోప్తే క్షేత్రేన శాద్వలే
[వశిష్ఠ స్మృతిః]

జలాశయము వద్ద ఉమ్ములు ఉమియుచూ, అక్కడే పళ్ళుకూడా తోముదురు. ఇది అనుచిత కార్యం. అగ్ని, సూర్య, చంద్ర, గో, బ్రాహ్మణ జలాశయాలవైపు ముఖమునుంచి, మలమూత్ర విసర్జన చేసే

వారి ప్రజ్ఞ నశిస్తుంది. నదిలోను, భస్మముపైన, పేడపైన విత్తులు జల్లిన పొలములందూ, మార్గమధ్యములోనూ, పచ్చనిగడ్డిపైన మలమూత్రములను విసర్జించరాదు. నూరు గజముల దూరములో మలవిసర్జన చేయవలెను. నదీతీర్థాదులందు దూరముగా మలమూత్ర విసర్జన గావింపవలెను.

## మృత్తికా ప్రయోగము

శ్లో॥ ద్వే లింగే మృత్తికే దేయే గుదే పంచ కరే దశ॥
ఉభయోః సప్తదాతవ్యావిట్ శౌచే మృత్తికాః స్మృతాః॥
[భృగుః]

శౌచం నిమిత్తం నీటితో నింపిన ఒక పెద్దపాత్రను తీసికొనవలెను. దానితోపాటు శుద్ధమైన మట్టినికూడ తీసికొనవలెను. శౌచ నివృత్తి అయిన పిమ్మట నీటితో మూమ్మూలుగ ప్రక్షాళనం చేసి....మట్టితో రెండుసార్లు మూత్రేంద్రియమును, అయిదుసార్లు మలేంద్రియమును శుభ్రపరచుకోవలెను. అలా ఆచరించినచో.... శాస్త్రముయొక్క ఆజ్ఞాపాలన పుణ్యము దక్కుతుంది. అంతేకాకుండా.... గోకుడు మొదలైన చర్మ వ్యాధులురావు. పైన చెప్పిన రీతిని ఆచరించకున్నచో.... చర్మవ్యాధులు సంక్రమించ వచ్చును. బ్రహ్మచర్యపాలనవల్ల ఇవి సిద్ధించగలవు. ఆ తరువాత ఎడమచేతిని మట్టితో పదిసార్లు, తిరిగి రెండు చేతులు ఏడుసార్లు పరిశుభ్రము చేసికొనవలెను.

శ్లో॥ స్త్రీ శూద్రయో ర్ధమానం శౌచం ప్రోక్తం మనీషిభిః।
దివా శౌచస్య నిశ్యర్థం పథి పాదో విధీయతే॥
ఆర్తః కుర్యా ద్యథాశక్తిశక్తః కుర్యాద్యథోతితమ్॥
[అగ్ని పురాణే]

పైన చెప్పిన శౌచ విధులలో సగము స్త్రీలకు, శూద్రులకు చెప్పబడింది. పగటిలో అర్థశౌచం రాత్రియందు మార్గమందు నాల్గవభాగం రోగావస్థయందు యథాశక్తి శౌచవిధిని నిర్వర్తించవలెను. సామర్థ్యమున్నచో శాస్త్రమందు చెప్పిన విధి విధానముగా ఆచరించవలెను.

శ్లో॥ కుడ్యాం తర్జల వల్మీక మూషికోత్కర వర్త్మసు।
శ్మశానే శౌచ శేషే చ న గ్రాహ్యాః సప్తమృత్తికాః॥
[యమస్మృతిః]

ప్రజలు బద్ధకంచే ఎక్కడదో అక్కడిది మట్టితెచ్చి.... చేతులు శుభ్రపరచుకుంటారు. అది అంత మంచి అలవాటు కాదు. గోడలందలిది, నీటిలోనిది, పాము పుట్టలోనిది, ఎలుక కన్నములోనిది, నడిచే మార్గమందలిది, శ్మశాన మందలిది, మరొకరు శౌచంచేయగా మిగిలినది: ఈ ఏడు విధములైన ప్రదేశాలనుండి శౌచవిధికి మట్టి తీసికొని రాకూడదు.

శ్లో॥ యస్మిన్దేశే తు యత్తోయం యాచ యత్రైవ మృత్తికా।
సైవ తత్ర ప్రశస్తా స్యాత్ తయా శౌచం విధీయతే॥
(భృగుః)

అపవిత్రమైన ప్రదేశాన్ని విడిచిపెట్టి.... పవిత్ర ప్రదేశాన్నుండి మట్టిని తీసికొని రావలెను. ప్రయత్నం చేసినా శుద్ధమైన మట్టి లభించని ప్రదేశాన.... శిష్టపురుషులచే ఉపయోగింపబడు జల మృణ్మయములను ఉపయోగించ వచ్చును.

## దంతధావనము

శ్లో॥ ఉషః కాలే సముత్థాయ కృత శౌచో యథావిధి।
ముఖే పర్యుషితే నిత్యం భవత్య ప్రయతో నరః॥

మట్టితోనూ, నీటితోనూ చేతులు, కాళ్ళ కడిగికొని....ఆ తరువాత చక్కగా....ముఖశుద్ధికై దంతధావనము చేసికొనవలెను. రాత్రి నిద్రించి.... ప్రాతఃకాలమున లేవగానే స్వాభావికముగా.... దంతములకు, నాలుకకు, ముఖమునకు మలినము ఏర్పడి ఉంటుంది. వాటి శుభ్రతకై పచ్చని లేక ఎండిన దంత కాష్టముతో దంతధావనము చేయవలెను.

శ్లో॥ తస్మాచ్ఛుష్క మథార్ద్రం వా భక్షయే ద్దంతకాష్ఠకమ్।
కరంజం ఖాదిరం వాపి కదంబం కురంబం తథా॥
సప్తపర్ణం పృశ్నిపర్ణీ జంబూ నింబం తథైవ చ।
అపామార్గం చ బిల్వం చార్కం చోదుంబర మేవచ॥

ఏతే ప్రశస్తాః కథితా దంతధావన కర్మణి।
దంతకాష్ఠవిత్తి భక్ష్యవస్తు సమాసేనా ప్రకీర్తితః॥

కరంజి, ఖాదిర, కదంబం, కురబ, సప్తపర్ణి, ప్రశ్నిపర్ణి, గాముర, చంద్ర, మేడి, గోరింట, జంబూ, నింబ, అపామార్గ, బిల్వ, అర్క, ఔదుంబర మొదలైన దంతకాష్ఠములు, ఉత్తరేణి శ్రేష్ఠమైనవిగా చెప్ప బడ్డాయి.

దంతధావనానికి ముందు ఈ శ్లోకం చదువుకోవాలి.

శ్లో॥ ఆయుర్బలం యశోవర్చః ప్రజాః పశువసూని చ।
బ్రహ్మ ప్రజ్ఞాంచ మేధాం చ త్వం నోదేహి వనస్పతే॥

ఓ వనస్పతీ! మాకు ఆయువు, బలము, యశస్సు, తేజము, సంతానము, పశుసంపద, ఐశ్వర్యము, బ్రహ్మ సాక్షాత్కారానికి ఉపయుక్తము లైన మేధా ప్రజ్ఞలు ప్రసాదించుము.

శ్లో॥ ప్రతి పత్సర్వ షష్ఠీషు నవమ్యాం చైవ స త్తమా।
దంతానాం కాష్ఠ సంయోగాద్దహత్యా సప్తమం కులమ్॥
అభావే దంతకాష్ఠానాం ప్రతిషిద్ధదినేషు చ।
అపాం ద్వాదశ గంతూషై ర్ముఖశుద్ధిం సమాచరేత్॥
(హారీత స్మృతిః)

నిషిద్ధమైన రోజులలో దంతధావన చేయరాదు. సర్వ కాలము లందూ- పాడ్యమీ, షష్ఠి, నవమీ తిథులందూ దంతధావన నిషేధము. పై చెప్పిన రోజులందూ, దంతకాష్ఠం లభించనినాడు, లభించిన సాధనాల తోనే ముఖమును పరిశుభ్రపరచుకొని, నీటిలో పన్నెండుసార్లు పుక్కిలించి, ఉమ్మి వేయవలెను.

శ్లో॥ పురతః సర్వేదేవాచ్చ దక్షిణే పితర స్తథా।
ఋషయః పృష్ఠతః సర్వే వామే గండూష మాచరేత్॥
(ప్రయోగ పారిజాతే)

పుక్కిలింత ఎప్పుడూ ఎడమవైపు పుక్కిలించి ఉమ్మి వేయవలెను.

కారణమేమంటే.... ఎదురుగా దేవతలు, కుడివైపు పితరులు, వెనుక భాగాన ఋషులు ఉంటారని శాస్త్రాలు చెబుతున్నాయి. నడుస్తూగానీ, నిలబడిగాని దంతధావనము చేయరాదు. తూర్పు ఈశాన్య దిశల ముఖంగా కూర్చొని దంతధావనము చేయవలెను. దంతకాష్ఠమును మధ్యగా చీల్చి నాలుకను శుభ్రపరచి.... తిరిగి ఆ బద్దలను నీటితో కడిగి.... ఎడమ చేతివైపు విసరవలెను. కడగకుండా మాత్రము దంతకాష్ఠమును విసరరాదు.

## స్నానం

శ్లో॥ తతః స్నానం ప్రకుర్వీత దంతధావన పూర్వకమ్,
అత్యంత మలినః కాయో నవచ్ఛిద్ర సమన్వితః॥

దంతధావనానంతరము స్నానము చేయవలెను. నవరంధ్ర సమన్వితమైన ఈ శరీరము వస్తుతః మలిన పదార్థములతో కూడినది.

శ్లో॥ ప్రవత్యేష దివారాత్రౌ ప్రాతః స్నానం విశోధనమ్,
క్లిద్యంతి హి ప్రసుప్తస్య ఇంద్రియాణి స్రవంతి చ॥

రాత్రింబవళ్ళు ఇది మలినాన్నే కక్కుతుంది. అందుచేత.... ప్రాతః స్నానంతో దీనిని శుభ్రపరచుకొనవలెను.

శ్లో॥ అంగాని సమతాం యాంతి ఉత్తమాన్యధమై సహ,
నానా స్వేద సమాకీర్ణః శయనాదుత్థితః పుమాన్॥

(దక్షస్మృతిః)

నిద్రిస్తున్న సమయాన వెలువడే చెమటలో శరీరము తడుస్తుంది. ఇంద్రియాలు.... వాటి ద్వారాలగుండా మలాన్ని స్రవింపజేస్తుంటాయి. ఉత్తమాంగాలు కూడా.... అధమాంగాలతో సమానమౌతాయి.

శ్లో॥ అస్నాత్వా నాచరే త్కించి జ్జప హోమాదికః ద్విజః।
ప్రాతరుత్థాయ యో విప్రః ప్రాతః స్నాయీ భవేత్సదా॥

మలినములు విడచుటవలన.... నిద్రించిన మానవుడు స్నానము చేయకుండా.... జపహోమాది కర్మలు ఆచరించరాదు.

శ్లో॥ సప్త జన్మకృతం పాపం త్రిభిర్వర్షై ర్వ్యపోహతి।

ఉషస్యుషసి యత్స్నానం సంధ్యాయే ముదితే రవౌ॥

అందుచేత... ఉదయాన్నే లేచి, ప్రతినిత్యం స్నానం చేసినచో.... ఆ విప్రుడు....మూడు సంవత్సరాలలో యేడు జన్మములందు చేసిన పాపములను పోగొట్టుకుంటాడు.

శ్లో॥ ప్రాజాపత్యేన తత్తుల్యం మహాపాతక నాశనమ్।
ప్రాతః స్నానం ప్రశంసంతి దృష్టాదృష్టకరం హితమ్।
సర్వమర్హతి పూతాత్మా ప్రాతః స్నాయీ జపాదికమ్।

ప్రతిరోజూ.... ప్రాతఃకాలాన స్నానమాచరించటం.... మహా పాతకాలు నశింపజేసే ప్రాజాపత్య వ్రతముతో సమానము. ప్రాతఃస్నానము అదృష్ట పుణ్యంకన్న ప్రత్యక్ష లాభకారికూడ అయి ఉన్నది. ప్రాతః కాలమందు స్నానము చేసి పవిత్రుడగువాడు.... జపాది సర్వకర్మలు చేసేందుకు అర్హుడౌతాడు.

శ్లో॥ గుణా దశ స్నాన పరస్యసాధో రూపంచ పుష్టిశ్చ బలం చ తేజః,

ఆరోగ్య మాయుశ్చ మనోనురుద్ధ దుఃస్వప్న ఘాతశ్చ తపశ్చ మేధా॥ (దక్షస్మృతిః)

స్నానమువల్ల రూపము, పుష్టి, బలము, తేజము, అరోగ్యము, దీర్ఘాయుర్దాయము, చిత్త ప్రసన్నత, దుఃస్వప్న నాశనము, తపస్సు, గ్రంథ ధారణ చేసేందుకు తగిన బుద్ధిశక్తి అనే పది ప్రత్యక్ష లాభాలు సిద్ధిస్తాయి.

శ్లో॥ అజ్ఞానాద్యది వా మోహాద్రాత్రౌ యద్దురితం కృతమ్,
ప్రాతః స్నానేన తత్సర్వం శోధయంతి ద్విజోత్తమాః॥
(విష్ణుస్మృతిః)

అజ్ఞానంవల్లకాని, మోహంవల్లకానీ రాత్రులందు పాపకార్యాలు చేయటంవలన శరీర దోషాలు ప్రాప్తిస్తాయి. ప్రాతః స్నానముతో ఆ దోషాలు శుద్ధి కాగలవు.

శ్లో॥ కృత్వాథ శౌచం ప్రక్షాళ్య హస్తౌ పాదౌచ మృజ్జలైః।
నిబద్ధశిఖా కచ్ఛస్తు ద్విజ ఆచమనం చరేత్॥

(వృద్ధపారాశరం:)

శాస్త్రీయమగు స్నానవిధి ఈ విధముగా నున్నది. ఏమన? శౌచానంతరము జలమృణ్మయాదులతో హస్త-పాదాదులు ప్రక్షాళనము గావించిన తరువాత శిఖను బంధించి, గోచి బిగించి ముడివేసి ఆచమనము చేయాలి.

శ్లో॥ సంకల్పశ్చ యథా కుర్యాత్స్నానందాన వ్రతాదికే॥

(బృహద్యమః)

కుడిచేతిలోనికి నీరు తీసికొని స్నానము కొరకు సంకల్పం చేయాలి. అటుపై....విష్ణుర్విష్ణుః తత్పదద్యే తస్య శ్రీ బ్రహ్మణో ద్వితీయపరార్ధే శ్రీ శ్వేతవరాహకల్పే, వైవస్వత మన్వన్తరే కలియుగే ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, దండకారణ్యే కర్మభూమౌ అస్మిన్వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన ఆర్యావర్తైక దేశాన్తర్గతే పుణ్యక్షేత్రే కలియుగే, కలి ప్రథమ చరణే, అముక సంవత్సరే అముక మాసే, అముకపక్షే, అముక తిథౌ, అముక వాసరే, అముక గోత్రోత్పన్నః, అముక శర్మా, (వర్మా) అహం మమోపాత్త దురితక్షయ పూర్వకం శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం ప్రాతః స్నానం కర్యిష్యే.

నేను బ్రహ్మయొక్క ద్వితీయ పరార్థమందు, శ్వేతవరాహ కల్పములో, జంబూద్వీపాంతర్గత భరత ఖండమందు, ఆర్యావర్త దేశంలో, పుణ్యక్షేత్రంలో, కలియుగ ప్రథమ పాదంలో, అముక సంవత్సర, అముక మాస, అముక పక్ష, అముక తిథి, అముక దిన, అముక గోత్ర మందు ఉద్భవించిన అముక శర్మ నామధేయుడనైన నేను నా సమస్త సంచితపాప వినాశనార్థం, పరమేశ్వరి ప్రీత్యర్థం ప్రాతః స్నానం చేస్తాను.

అముకశబ్ద స్థానములో సంవత్సరము, మాసము ఆదిగా గల నామాలుజోడించవలెను. బ్రాహ్మణుడు తన పేరుకు తరువాత శర్మ అని, క్షత్రియుడు వర్మ అని, వైశ్యుడు గుప్త అని శబ్ద ప్రయోగము చేయాలి.

శ్లో॥ విష్ణోః పాదప్రసూతాఽసి వైష్ణవీ విష్ణుదేవతా,
బ్రాహిన స్త్వేన స్త స్మాదా జన్మ మరణాంతికాత్॥
గంగేచ యమునేచైవ గోదావరి సరస్వతి।
నర్మదే సింధు కావేరి జలేఽస్మిన్ సన్నిధింకురు॥

వైష్ణవీ! విష్ణుదేవతా! గంగా! నీవు విష్ణుభగవానుని చరణకమలముల నుండి వెలువడ్డావు. జన్మజన్మాంతరము లందలి పాపాలనుండి మమ్ములను రక్షించు. ఓ గంగే! యమునే! గోదావరీ! సరస్వతీ! నర్మదే! సింధూ! కావేరీ! మీరందరూ ఈ జలములో ప్రవేశించండి.

మంత్రం ; అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాం గతోఽపివా,
యః స్మరేత్పుండరీకాక్షం న బాహ్యాభ్యంతరః శుచిః॥

పవిత్రుడైనా, అపవిత్రుడైనా, ఎవడైనా, ఏ అవస్థయందు ఉన్న వాడైనా పుండరీకాక్షుడైన శ్రీహరిని స్మరించేవాడు బాహ్యంగా, అభ్యంతరంగా పవిత్రుడౌతాడు.

శ్లో॥ ఆపో నారాయణోద్భూతాస్తా ఏ వాస్యాయనం పునః।
తస్మాన్నారాయణం దేవం స్నానకాలే స్మరే ద్బుధః।

జలము భగవానుడైన నారాయణునిచే ఉత్పన్నమైనది. తిరిగి ఆ జలమే ఆయన నివాస స్థానమైనది. ఆ కారణముచేత స్నానము చేసే సమయాన నారాయణ భగవానుని అవశ్యంగా స్మరించి తీరవలెను.

శ్లో॥ పాదౌ ప్రక్షాళయే త్పూర్వం ముఖం యజ్ఞోపవీతకమ్
(బౌధాయనం)

అశిరస్కం భవేత్స్నానం స్నానాశక్తౌతు కర్మిణామ్,
ఆర్ద్రేణ వాసనా వాపి మార్జనం దైహికం విదుః॥
(జాబాలిః)

స్నానము చేసేముందు పాదాలు కడుక్కోవలెను. ఆ తరువాత శిరస్సుపై నీరు పోసికొని స్నానము చేయాలి. స్నానము చేసే నీరు శుభ్ర మైందిగాను, స్వచ్ఛంగాను, నిర్మలముగాను ఉండవలెను

## అసమర్థతయందు

శ్లో॥ సంక్రాంత్యాం రవివారేచ సప్తమ్యాం రాహుదర్శనే
ఆరోగ్య పుత్ర మిత్రార్థేన స్నాయా దుష్టవారిణా।
మృతే జన్మని సంక్రాంతౌ శ్రాద్ధే జన్మదినే తథా।
అస్పృష్ట స్పర్శనే చైవ న స్నాయా దుష్ట వారిణా॥

(వృద్ధమనుః)

అనారోగ్యముగా ఉన్ననాడు, బాగుగా స్నానము చేయడానికి శక్తి సామర్థ్యాలు లేనినాడు....హస్త పాదాదులు పరిశుభ్రపఱచుకొని, ఆ తరువాత....ఆచమన సంకల్పాలు చేసి శిరస్సుకు క్రిందనున్న అంగాలను కడుక్కొనవలెను. అనగా.... కంఠస్నానము చెయ్యవలెను. లేక.... తడిసిన తువ్వాళ్ళతో శరీరాన్ని తుడుచుకొనవలెను. ఆ తరువాత.... శుభ్రమైన పొడివస్త్రాన్ని ధరించవలెను. వేడినీళ్ళతోకూడా స్నానము చేయవచ్చును.

కాని.... సంక్రాంతి, ఆదివారము, సప్తమి, గ్రహణ కాలాన్ని, సంపూర్ణ ఆరోగ్యముగా ఉన్ననాడు, పుత్ర-మిత్రులు కావలెనను కోరికతో నున్నప్పుడు, ఎవరేని జన్మించినా, మరణించినా శ్రాద్ధ దినమునాడు- తాను పుట్టిన రోజున, అస్పృశుణ్ణి స్పృశించినప్పుడు వేడినీళ్ళతో స్నానము చేయరాదు.

శ్లో॥ ఇక్షురాపః ఫలం పయ స్తాంబూల మౌషధమ్।
భక్షయిత్వాపి కర్తవ్యా స్నాన దానాదికాః క్రియాః॥

(చతుర్వింశతిమతే)

అనారోగ్యముగా ఉన్నప్పుడు అవశ్యకత వచ్చినను చెరకు, జల, ఫల, మూల, దుగ్ధ, తాంబూలాదులు సేవించవలసి వచ్చినను.... అవి భుజించిన అనంతరము కూడ స్నాన దానాది క్రియలు చేయవచ్చును.

# నది- సరోవరాలందు స్నానం చేసే సమయాన

శ్లో॥ స్రోతసోఽభిముఖం స్నాయాన్న దీషు ప్రవహాజ్జలే।
స్థావరే చ తటాకే చ రవే రభిముఖం సదా॥ (విష్ణుః)

నదిలో స్నానముచేసే సమయాన- ప్రవాహానికి ఎదురుగా ముఖము నుంచి స్నానము చేయవలెను. స్థిరంగా ఉన్న జలాశయాలందు స్నానము చేయవలసి వస్తే... సూర్యునికి ఎదురుగా ముఖమునుంచి స్నానము చేయవలెను.

శ్లో॥ గృహే గృహముఖం కూపే తడాగే సూర్యసన్నిధౌ।
ప్రాతః సంక్షేపతః స్నానం శౌనార్థే తు తదిష్యతే॥ విష్ణు॥

గృహములో స్నానము చేయవలసివస్తే.... గృహము వైపు ముఖము నుంచి స్నానము చేయవలెను. నూతివద్ద స్నానము చేసేటప్పుడు సూర్యాభి ముఖంగా స్నానము చేయవలెను.

శ్లో॥ నిష్పీడ్య స్నానవస్త్రం తు పశ్చాత్సంధ్యాం సమాచరేత్।
యన్యథా కురుతే యస్తు స్నానం తస్యాఫలం భవేత్॥
(వృద్ధమనుః)

సత్య స్నానానంతరము తడిసిన వస్త్రాలను ఉతికి పైన పడవేయ వలెను. ఆ తరువాత సంధ్యాకర్మ చేయవలెను. అలా చేయక.... ఇతర విధముగ చేసిన నాటి స్నానము నిష్ఫలమే అవుతుంది.

## తీర్థ స్నానము

తీర్థ స్నానము చేసే సమయాన సంకల్పము చేసి, ముందుగా చేతి లోనికి శుద్ధ మృత్తికను తీసికొని-

శ్లో॥ అశ్వక్రాంతే రథక్రాంతే విష్ణుక్రాంతే వసుంధరే।
మృత్తికే హరమేపాపం యన్మయా దుష్కృతం కృతమ్॥

"ఓ వసుంధరా! నీవు అశ్వక్రాంత, రథక్రాంత, విష్ణుక్రాంతివి.

ఓ మృత్తికే! నేను చేసిన దుష్కార్యాచరణ వలన సిద్ధించిన పాపాలను దూరము చేయి!" అని అభిమంత్రించాలి.

తిరిగి....కుడిచేతితో శిరస్సును, కంఠమును, బాహువులను, హృదయాన్ని నాభి యందున్నూ తగల్చవలెను. ఎడమచేతిలో కటి ప్రదేశానికి క్రింద ఊరువు తొడలయందును, పైన జానువులకు, మోకాళ్ళకున్నూ పాదాది ప్రదేశములందు మట్టిని తగల్చవలెను. అనంతరము.... భగవన్నామము స్మరిస్తూ.... జలస్నానము చేయుటకు ప్రవిష్టుడు కావలెను. ప్రవహించే జలంలో ప్రవాహము వైపు ముఖమునుంచి, స్థిరముగా ఉండే తటాకాదులలో సూర్యాభిముఖుడై, చేతితో పైనీటిని అటునిటు తొలగించి, మునిగి మూడుసార్లు స్నానము చేయవలెను. ప్రతిమారు నీటిలోపల ప్రణవమునుగాని, భగవంతుని ఏదో ఒక నామమునుగాని, మూడుసార్లు ఉచ్చరించవలెను. తీర్థజలములో ఉమ్మివేయడముగానీ, పుక్కిలించటము గాని చేయరాదు. స్నానానంతరము ఒడ్డుకు వచ్చి-

**మంత్రము : యన్మయా దూషితం తోయం శారీర**
**మలసంశ్రయైః।**
**తస్య పాపస్య నిష్కృత్యై యక్ష్మ త్తే నమోనమః॥**

దేహ మలముతో నేను స్నానము చేస్తున్న సమయాన జలాన్ని దూషితము చేస్తున్నాను. ఆ పాపశాంతి కొరకు జలాన్ని రక్షించే యక్షుడవైన నీకు పునః పునః నమస్కరిస్తున్నాను అని.... ఈ మంత్రాన్ని జపించి, మూడు దోసిళ్ళ నీరు గట్టుపైన విడిచిపెట్టవలెను. అ తరువాత.... బయటకు వచ్చి పొడివస్త్రముతో శిరస్సు తుడుచుకొనవలెను. శేషాంగములందలి నీటిని వస్త్రముతో తుడవరాదు. బట్టలు మార్చి, తర్పణము అయిన తరువాత.... స్నానము చేసి, బట్టలను ఉతికి శుభ్రపరచుకొనవలెను. నగ్నముగా స్నానము చేయరాదు.

గంగలో గాని, నర్మదలో గాని స్నానము చేసే సమయాన "గంగేచ యమునే చైవ" అనే మంత్రాన్ని పఠించక.... గంగా లేక నర్మదా నదులపై గల స్తోత్రాలు స్మరణలో ఉంటే....వాటిని పఠించవలెను,

## వస్త్రధారణము

శ్లో॥ స్నాత్త్వైవ వాససీ ధౌతే అక్లిన్నే పరిధాపయేత్।
ప్రక్షాళ్య చరణద్వంద్వం హస్తౌ ప్రక్షాళయే త్తతః॥
[నాగదేవః]

నీలం పరివదిష్యతే। [మనుః]

స్నానానంతరము యెండిన పంచెను ధరించవలెను. ఒక అధో వస్త్రము, మరొక ఉత్తరీయము ఉండవలెను. పాద ప్రక్షాళనము గావించి, రెండు చేతులను శుభ్రముగా కడుగుకొనవలెను. నీలి వస్త్రములను శాస్త్రీయ కర్మలందు ధరించరాదు.

శ్లో॥ స్వయం ధౌతేన కర్తవ్యాః క్రియధర్మా విపశ్చితా।
న తు నేజక ధౌతేనా నాహత్తేన చ కర్హిచిత్॥ [దేవలః]

స్వయముగా ఉతుకుకొనిన వస్త్రములతోనే బుద్ధిమంతులు ధర్మ కర్మలు చేయవలెను. చాకలిచే ఉతకబడిన వస్త్రములు పై చెప్పిన కర్మ లందు యోగ్యములు కావు.

శ్లో॥ ఆర్ద్ర వాసా తు యః కుర్యా జ్జపహోమ పరిగ్రహాన్।
సర్వం తద్రాక్షసం విద్యాత్కర్మజాతం చ యత్కృతం॥
మజ్జతే శుష్కవస్త్రే ర్ధతే చైవార్ద్ర వాససా,
జపో హోమ స్తథా దానం తత్సర్వ నిష్ఫలం భవేత్॥
న న్యూతేన న దగ్ధేన పారగ్యణ విశేషతః॥
మూషకోత్కీర్ణ జీర్ణేన కర్మకుర్యా ద్విచక్షణః॥
[ఆపస్తంబః]

స్థలమందు తడిసిన వస్త్రాన్ని ధరించి జప, హోమ, పరిగ్రహాది కర్మలాచరించిన అవి దానవులకు ప్రాప్తిస్తాయి. జలమందు పొడి బట్టను, స్థలమందు తడిసిన బట్టను ధరించి జప హోమ, దానాలు చేసినచో అవి నిష్ఫలాలే అవుతాయి. అగ్నిచే తగులబడిన, ఇతరులచే ధరింప

బడిన లేక ఎముకలచే కొరకబడి శిధిలమైన వస్త్రాలను ధరించి బుద్ధిమంతులు శాస్త్రీయ కర్మలు చేయరాదు.

## ఆచమనము- ప్రాణాయామము

శ్లో॥ స్నాత్వా హ్యాచమ్య విధివత్తతః ప్రాణాన్సమాపయేత్
ప్రాణాయామైస్త్రిభిః పూతో గాయత్రీం తు జపే ద్విజః

[సంవర్త స్మృతి]

వస్త్రధారణానంతరం.... విధి విధానంగా ఆచమనము మరియు ప్రాణాయామము చేయవలెను.

శ్లో॥ కర్మాంగే తు త్రిరాచమ్య ప్రాణాయామత్రయం స్మృతమ్॥

[ఆరాచతిలకే]

స్నానాంగాచమనం మూడుసార్లూ, ప్రాణాయామం మూడుసార్లూ చేయవలెను.

శ్లో॥ అంతర్జాను శుచౌ దేశే ఉపవిష్ట ఉదఙ్ముఖః।
ప్రాగ్వా బ్రాహ్మేణ తీర్థేన ద్విజో నిత్యమపః స్పృశేత్॥

[నాగదేవః]

తూర్పు లేక ఉత్తర దిక్కులవైపు ముఖమునుంచి, పవిత్రప్రదేశాన కూర్చొని, చేతులను మోకాళ్ళలోనికి పోనిచ్చి బ్రాహ్మణుడు నిత్యము బ్రహ్మ తీర్థంతో ఆచమనము చేయవలెను. అంగుష్ఠ మూలాన్నే బ్రహ్మ తీర్థమంటాడు.

శ్లో॥ ప్రాణాయామైర్వినా యద్యత్కృతం కర్మ నిరర్థకమ్,
అతో యత్నేన కర్తవ్యః ప్రాణాయామః శుభార్థినా॥

(అగస్త్య సంహితాయామ్]

ప్రాణాయామం చేయకుండ ఆచరించే శాస్త్రీయ కర్మలు వ్యర్థాలే అవుతాయి. ఆ కారణముగా శ్రేయోభిలాషులైనవారు ప్రయత్న పూర్వకముగా ప్రాణాయామము చేయవలెను.

# భస్మధారణము

శ్లో॥ మృద్భస్మ చందనం ప్రోక్తం తోయం చైవ చతుర్థకమ్।
స్నాత్వా పుండ్రమంమృదా కుర్యాత్ప్రక్షాల్యైవ తు భస్మనా।
దేవసభ్యర్చ్య గంధేన జలమధ్యే జలేన తు॥
[ప్రయోగ పారిజాతే]

మట్టి, భస్మము, చందనము, జలము : ఈ నాల్గు లలాటముపై ధరించుటకు తగినవని చెప్పబడ్డాయి. స్నానము చేసిన తరువాత మట్టి తోను, ప్రక్షాళనానంతరం భస్మముతోను, దేవతారాధన చేసి....చందనము తోను, జలమధ్యమున నున్నప్పుడు జలముతోను పుండ్రము ధరించవలెను.

శ్లో॥ ప్రమాదాత్త్యక్త్వా భస్మధారణం న గాయత్రీం జపేత్।
న జుహుయాదగ్నౌ తర్పయేత్ దేవాన్ఋషి పిత్రాదీన్।
అయమేవ ధర్మః సనాతనః సర్వపాపనాశకో మోక్షహేతుః॥
(భస్మజాబాలోపనిషత్)

స్నానము చేసిన తరువాత ప్రమాదవశాత్తు భస్మధారణ చేయ కున్న.... అట్టివాడు గాయత్రీ జపము చేయుటానికి అధికారి కాడు. అంతే కాదు.... అగ్నిలో హవనము చెయ్యటానికి కాని, దేవ ఋషి-పితృ తర్ప ణాలు చెయ్యటానికి కాని అర్హుడు కాడు.

సర్వపాప నాశనము చేస్తూ మోక్షహేతువైనదీ సనాతన ధర్మమే। భస్మధారణ చెయ్యటమువల్లనే పై కర్మలు ఆచరించటానికి అర్హుడౌతాడని అభిప్రాయము.

శ్లో॥ స్నానం దానం జపో హోమః సంధ్యా స్వాధ్యాయ కర్మసు।
ఊర్ధ్వపుండ్ర విహీనశ్చే తత్సర్వం నిష్ఫలం భవేత్॥
(బృహన్నారదీయే)

స్నాన, దాన, జప, హోమ, సంధ్యా స్వాధ్యాయ కర్మలు ఊర్ధ్వ పుండ్రధారణ చేయకుండా చేస్తే నిష్ఫలాలే అగును.

శ్లో॥ శ్రాద్ధే యజ్ఞే జపే హోమే వైశ్వదేవే సురార్చనే,
ధృతి పుండ్రః పూతాత్మా మృత్యుం జయతి మానవః॥
(కాత్యాయనః)

శ్రాద్ధ, యజ్ఞ, జపహోమ, వైశ్వదేవ, దేవపూజాది కర్మలందు ఎవడు త్రిపుండ్రధారణ చేయునో.... ఆ పుణ్యాత్ముడు మృత్యువును జయించ గలడు.

శ్లో॥ ధార్యం భస్మం త్రిపుండ్రం తు గృహిణా జల సంయుతమ్,
సర్వకాలం భవేత్ స్త్రీణాం యతీనాం జలవర్జితమ్॥
వానప్రస్థస్య కన్యానాం దీక్షాహీననృణాం తథా,
మధ్యాహ్నా త్ప్రాగ్జలై ర్యుక్తం పరతో జలవర్జితమ్॥
మధ్యాంగులి త్రయేణైవ స్వదక్షిణకరస్య చ,
త్రిపుండ్రం ధారయే ద్విద్వాన్ సర్వకిల్బిష నాశనమ్॥
(ప్రయోగ పారిజాతే)

గృహస్థు నీటితోకలిపిన భస్మముతో త్రిపుండ్రధారణ చేయవలెను. స్త్రీలు, సన్యాసులు ఎల్లప్పుడు పొడి భస్మాన్నే ధరించాలి. కన్య, దీక్షా హీనుడైన పురుషుడు మధ్యాహ్నానికి పూర్వమందు జలంతో కూడినట్టిదియు మధ్యాహ్నోత్తరమందు జలరహిత భస్మాన్ని ధరించవలెను. విద్వాం సులు కుడిచేతి మధ్య మూడు వేళ్ళతోను సమస్త పాపనాశన కారకమైన త్రిపుండ్రాన్ని ధరిస్తారు.

## భస్మధారణ చేసే విధి

ఎడమచేతి అరచేతిలో భస్మముంచి, ఆ భస్మమును కుడిచేతి అర చేతితో కప్పవలెను. తిరిగి-

శ్లో॥ అగ్నిరితి భస్మవాయురితి భస్మజలమితి భస్మస్థలమితి,
భస్మవ్యోమితి భస్మ సర్వంహవా ఇదం భస్మ మన ఏతాని చక్షూంషి॥

అగ్ని భస్మము, వాయు భస్మము, జల భస్మము, స్థల భస్మము ;

ఇదంతా భస్మము. మనస్సు, నేత్రాలు కూడా భస్మమే. అనే మంత్రముతో దానిని అభిమంత్రించిన పిదప కుడిచేతి మూడు వేళ్ళతోనూ-

శ్లో॥ త్ర్యాయుషం జమదగ్నేః।
కశ్యపశ్య త్ర్యాయుషమ్।
యద్దేవేషు త్ర్యాయుషమ్।
తన్నోఽస్తు త్ర్యాయుషమ్॥

జమదగ్ని యొక్క, కశ్యప మహర్షి యొక్క, దేవతలయొక్కయు మూడురెట్లు ఆయుర్దాయము కలుగుగాక! అని పై శ్లోక పాదములను చదువవలెను. మొదటి పాదము పఠించి లలాటమందు, రెండవ పాదము పఠించి కంఠసీమయందు, మూడు నాలుగు పాదములు జపించి భుజ మూలమందు, హృదయమందు భస్మధారణ చేయవలెను.

మలవిసర్జనము మొదలు భస్మధారణ పర్యంతము సంక్షేపంగా శాస్త్రీయ శౌచాచార వర్ణనము అయింది. దీనిని యథాయోగ్యంగా స్త్రీ-పురుషులూ, సమస్త వర్ణములవారు చేయటము అనివార్యము.

## సంధ్యావందనము

శ్లో॥ అహరహః సంధ్యా ముపాసీతః (తైత్తిరీయ)

ద్విజాతులకు ఉపనయనానంతరము సంధ్యావందనము అనివార్యమనీ, ప్రతిదినము చేయాలనీ, (బ్రాహ్మణజాతికి) అది శాస్త్ర సమ్మతమనీ శాస్త్రములు చెబుతున్నాయి.

శ్లో॥ సర్వేః కర్మే సముత్థాయ కృతశౌచః। సమాహితః।
స్నాత్వా సంధ్యా ముపాసీత సర్వకాలమతంద్రితః॥
(విష్ణుస్మృతి)

ప్రాతఃకాలాన లేచి శౌచ స్నాన నివృత్తుడవైన తరువాత సమాహిత చిత్తంతో నిద్రను త్యజించి సంధ్యోపాసన చేయవలెను.

శ్లో॥ నానుతిష్ఠతి యః పూర్వాం నోపాస్తేయశ్చ పశ్చిమామ్।
స శూద్రవద్బహిష్కార్యం సర్వస్మాద్ ద్విజకర్మణః॥
(మనుస్మృతి)

ప్రాతః సాయం సంధ్యానుష్ఠానము చేయనివాడు ద్విజోచిత కర్మాచరణకు శూద్రునివలె బహిష్కరింప దగినవాడు.

శ్లో॥ సంధ్యాయేన న విజ్ఞాతా సంధ్యా నైవాప్యుపాసితా,
జీవమానో భవేచ్ఛూద్రో మృతః శ్వా చైవజాయతే॥

(యాజ్ఞవల్క్యః)

సంధ్యావందనము తెలియనివాడూ, తెలిసియు ఉపాసించనివాడు బ్రతికియున్న శూద్రునితో సమానుడే అగును.

శ్లో॥ అనార్తశ్చేత్సంత్యజేద్ యస్తు స విప్రః శూద్రసమ్మితః,
ప్రాయశ్చిత్తీ భవేచ్చైవ లోకే భవతి నిందితః॥

(యాజ్ఞవల్క్యః)

ఆపదలు లేకనే బ్రాహ్మణుడు సంధ్యావందనము త్యజించినచో.... అతడు శూద్రసమానుడే! అతడు ప్రాయశ్చిత్తము చేసికోదగును. అతడు లోకనిందితుడుగాకూడా వ్యవహరింపబడతాడు.

శ్లో॥ న సంధ్యాహీనోఽశుచిర్నిత్యమనర్హః సర్వకర్మసుః।
యదన్యత్ కురుతే కర్మ న తస్య ఫలభాగ్భవేత్॥

(దక్షస్మృతిః)

సంధ్యావందన విహీనుడైన ద్విజుడు అపవిత్రుడే అవుతాడు. అతడు ఏ ద్విజ కర్మలందును అధికారి కాజాలడు. అట్టివాడు ఏ కొంచెము కర్మ చేసినా.... ఆ కర్మయొక్క ఫలము పొందలేడు.

శ్లో॥ యః సంధ్యాం కాలతః ప్రాప్తామాలస్యాదతి వర్తతే,
సూర్యహత్యా మవాప్నోతి ఉల్లూకత్వమియాత్ స చ॥

(అత్రిః)

సమయము ప్రాప్తించినను సంధ్యావందన మాచరించక బద్ధకించి ఉల్లంఘించే బ్రాహ్మణుడు సూర్యుణ్ణి హింసించినంత పాపము పొందుతాడు. అంతేకాదు...మరణానంతరము అతడు మరుజన్మలో గుడ్లగూబై జన్మిస్తాడు.

శ్లో॥ సంధ్యా ముపాస్తే యే తు నియతం సంశితవ్రతాః,
విధూతా పాపాస్తే యాంతి బ్రహ్మలోక మనామయమ్॥
(యమస్మృతిః)

ఉత్తమ వ్రతపాలన చేస్తూ.... ప్రతిదినము నియమానుసారముగా సంధ్యావందనము చేసేవాడు.... పాపరహితుడై అమలిన బ్రహ్మపదాన్ని పొందుతాడు.

శ్లో॥ పూర్వాం సంధ్యాం జపం స్తిష్ఠన్ నైశమేనో వ్యపోహతి,
పశ్చిమాంతు సమాసీనో మలం హంతి దివాకృతమ్॥
(మనుస్మృతి)

ప్రాతఃకాల సంధ్యావందనము వల్ల రాత్రి చేసిన పాపాలునశిస్తాయి. సాయం సంధ్యాచరణమువల్ల పగటి పాపాలు నశిస్తాయి.

శ్లో॥ యస్తు తాం కేవలాం సంధ్యాముపాసీత స పుణ్యభాక్,
తాం పరిత్యజ్య కర్మాణి కుర్వన్ ప్రాప్నోతి కిల్బిషమ్॥
(యాజ్ఞవల్క్యః)

కేవలము సంధ్యావందనము చేసేవానికి పుణ్యము ప్రాప్తిస్తుంది. కాని.... సత్కర్మానుష్ఠానం చేసినా, సంధ్య వార్చుకొననిచో.... పాపమే ప్రాప్తిస్తుంది.

శ్లో॥ సంధ్యాలోపస్య చాకర్తా స్నానశీలశ్చ యః సదా,
తాం దోషా నోపసర్పంతి గరుత్మంత మివోరగాః॥
(కాత్యాయనః)

ప్రతినిత్యము స్నానము చేస్తున్నట్లే సంధ్య వారుస్తాడు. లోపము చేయడు అట్టివాడు ... బాహ్యాభ్యంతర దోషాలకు దూరుడౌతాడు. గరుడుని సమీపానికి పాములు చేరనట్లు.... బాహ్యాభ్యంతర దోషరహితు డగుటచే పాములు వానిని చేరవు. గరుత్మంతుని వద్దకు సర్ప మెట్లు పోదో.... అట్లే.... పై జెప్పిన ప్రమాణాలపై విచారణ చేసి చూస్తే.... ఇట్టి నిశ్చయము సిద్ధిస్తున్నది. ఏమనగా.... ద్విజాతి సంధ్యావందనము

తప్పక చేసి తీరాలి. అది ప్రమాదవశాత్తు గాని, బద్ధకంవల్లగాని సంధ్యావందనము విడిచిపెట్టటము ఉచితము కాదు. శౌచ స్నానాంతరము ప్రథమముగా సంధ్యోపాసనయందు లగ్నము కావాలి. సంధ్యావందన విధి చెప్పే గ్రంథములు సులభముగా లభించగలవు. యోగ్యమైన వ్యక్తి ద్వారా ఈ సంధ్యావందనము నేర్చుకొని, ప్రతినిత్యము అనుష్ఠించవలెను.

## ఉత్తమదేశ- కాలాలు

**శ్లో॥ పుణ్యక్షేత్రం నదీతీరం గుహా పర్వత మస్తకమ్,**
**తీర్థప్రదేశాః సింధూనాం సంగమః పావనం సరః॥**

**(శారదా)**

సంధ్యావందనమునకు పవిత్రమైన, ప్రశాంతమైన రమణీయమైన ప్రదేశము ఉండిన.... ఉత్తమంగా ఉంటుంది. పుణ్యక్షేత్రము, నదీతీరము, పర్వతగుహ శిఖరము, తీర్థప్రదేశము, నదీసంగమము, పవిత్ర జలాశయము ఉండు ప్రదేశాలలో మాత్రమే ఏకాగ్రత, సాత్వికత, శాంత స్వభావము ఏర్పడతాయి.

**శ్లో॥ ఉద్యానాని వివిక్తాని బిల్వమూలం తటం గిరేః,**
**దేవాద్యాయతనం కూలం సముద్రస్య నిజం గృహమ్॥**

**(అహ్నిక సూత్రావల్యామ్)**

ఏకాంతమైన తోట, బిల్వవృక్షము క్రింద, పర్వత సమీప ప్రాంతమున దేవాలయము, సముద్రపు ఒడ్డున తన యింటియందు సంధ్యావందన మాచరించాలని శాస్త్రములో నిర్దేశించబడింది.

**శ్లో॥ ఉత్తమా తారకోపేతా మధ్యమా లుప్తతారకా,**
**అధమా సూర్యసహితా ప్రాతః సంధ్యా త్రిధా స్మృతా॥**
**ఉత్తమా సూర్యసహితా మధ్యమా లుప్తభాస్కరా,**
**అధమా తారకోపేతా సాయం సంధ్యా త్రిధా స్మృతా॥**

ప్రదేశము వలెనే....ఉత్తమ కాలాన్ని కూడా ఆలోచించాలి. ప్రాతః కాలమున సూర్యోదయానికి పూర్వమున్నూ, సాయంకాలము సూర్యాస్తమయానికి ముందున్నూ... సంధ్యావందనానికి ఉత్తమ కాలమని చెప్పబడెను. నక్షత్రాలు ఉండగా ఆచరించటము ఉత్తమమనీ, తారాగణము లోపించి నప్పుడు.... మధ్యమమనీ, సూర్యోదయము అయిన తరువాత ఆచరించటము అధమ కాలమని మూడు విధాలుగా ప్రాతః సంధ్య చెప్పబడింది. అదేరీతిని ... సాయంసంధ్య కూడ మూడు విధాలుగా విభజించబడింది. సూర్యాస్తమయానికి ముందు ఉత్తమమనీ సూర్యాస్తమయమైన తరువాత మధ్యమమనీ,నక్షత్రములు ఉదయించిన తరువాత అధమమని చెప్పబడింది.

శ్లో॥ గాయత్రీం శిరసా సార్థముక్త్వా వ్యాహృతిభిః సహ,
కాలాతీత విశుద్ధ్యర్థం చతుర్థార్ఘ్యం ప్రదాపయేత్॥
(మదన పారిజాతః)

సంధ్యావందన కర్మకు లోపము చేయకూడదు. ముఖ్యకాలములో సంధ్యావందనము ఆచరించటానికి వీలులేకపోతే ... గౌణకాలమందైనా ఆచరించవలెను. ప్రాతఃకాలమున... సూర్యోదయమైన తరువాత నాలుగు గడియలవరకూ, తరువాత.... సాయంకాలముసూర్యాస్తమయమైన పిమ్మట నాలుగు గడియల వరకున్నూ గౌణకాలమనియు తెలుసుకొనవలెను. ఆ సమయములోపల సంధ్యావందనము ఆచరించనిచో.... కాలలోపము కారణంగా ప్రాయశ్చిత్తము చేయనవసరము లేదు. దానిని మించి ఆలస్యమైనచో ప్రాయశ్చిత్తము ఈ విధముగా ఉన్నది.

మంత్రం: ఓం భూర్భువః త త్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి,
ధియోయోనః ప్రచోదయాత్,ఓం ఆపో జ్యోతిరసోఽమృతం బ్రహ్మ భూర్భువః స్వరోమ్॥ అను మంత్రమును చదివి సూర్యునకు నాల్గవ కాలము దాటినప్పుడు అర్ఘ్యం సమర్పించ వలెను.

శ్లో॥ స్నానం సంధ్యా తర్పణాది జపహోమ సురార్చనమ్
ఉపవాసవ్రతాకార్యం సాయం సంధ్యాహు తీర్వినా॥

అగ్నిహోత్రమునకు కాలము దాటినప్పుడు.... స్నాన సంధ్యా, తర్పణ, జప, హోమ, దేవతార్చనాది అన్నికర్మలు భోజనానికి ముందుగా చేయవలెను.

## సంధ్యావందన లోపమువలన ప్రాయశ్చిత్తం

శ్లో॥ ఏకాహం సమతిక్రమ్య ప్రమాదాదకృతం యది,
అహోరాత్రోషితో భూత్వా గాయత్ర్యాశ్చాయుతం జపేత్,
(జమదగ్నిః)

సంధ్యావందనము అవశ్యము చేయవలెను. దానిని ఉపేక్షించటము.... ఎట్టి విధముగను మంచిది కాదు. ఎప్పుడో చేయుట తటస్థించినచో.... దానికి ప్రాయశ్చిత్తము చేసికొనవలెను. ప్రమాదవశాత్తు ఒకనాడు సంధ్యావందనము చేయకున్నచో ఒకరాత్రి, ఒక పవలు ఉపవసించి, పదివేలు గాయత్రి మంత్రాన్ని జపించవలెను.

శ్లో॥ సాయం ప్రాతస్తు యం సంధ్యాం ప్రమాదాదిక్రమేతకృత్।
గాయత్ర్యాస్తు సహస్రం హి జపేత్స్నాత్వా సమాహితః॥
(అత్రిస్మృతిః)

సాయం ప్రాతః సంధ్యలలో సంధ్యావందనము ఒకపూట ఆచరించకున్నచో....స్నానం చేసి, సమాహిత చిత్తముతో సహస్ర గాయత్రీ జపము చేయవలెను.

శ్లో॥ సంధ్యాతిక్రమణం యస్య సప్తరాత్రమపి చ్యుతమ్,
ఉన్మత్త దోషయుక్తో వా పునః సంస్కార మర్హతి॥[శౌనకః]

ప్రమాదవశాత్తు ఏడు రాత్రులవరకు సంధ్యావందనము ఉన్మాద దోష దూషితుడైన బ్రాహ్మణుడు ఆచరించకున్న తిరిగి ఉపనయన సంస్కారము చేయవలెను.

శ్లో॥ రాష్ట్రభంగే నృపక్షోభే రోగార్తే సూతకేఽపి వా।
సంధ్యావందన విచ్ఛిత్తిర్న దోషాయ కథంచన॥
(జమదగ్నిః)

రాష్ట్ర విధ్వంస మైనప్పుడుగాని, రాజచిత్త సంక్షోభము కలిగి నప్పుడుగాని, శరీరం రోగగ్రస్త మైనప్పుడుగాని, జనన మరణ రూపమైన అశౌచము ప్రాప్తించినప్పుడుగాని.... సంధ్యావందన మాచరించక పోయి చచో.... అది దోషముగా లెక్కించబడదు.

శ్లో॥ కాలాతీతేషు సర్వేషు ప్రాప్తవత్సూత్తరేషు చ।
కాలాతీతాని కృత్వైవ విదధ్యాదుత్తరాణి తు॥
దివోదితాని కృత్యాని ప్రమాదాదకృతాని వై।
శర్వర్యాః ప్రథమే భాగే తాని కుర్యా ద్యథాక్రమమ్॥
(నాగదేవః)

సంధ్యావందనము నిత్యకర్మ అయి ఉన్నది. అకారణముగా సంధ్యావందనాన్ని త్యజించరాదు. ప్రాతః సాయం సంధ్యలలో ఏ సమ యములోనైనా సంధ్యావందన మాచరించకున్నచో....ముందు చేయబోయే సంధ్యావందనానికి ముందుగా సంధ్యవార్చి, ప్రాయశ్చిత్తము చెప్పినట్లు.... గాయత్రి చేసికొని, తిరిగి ఆ సమయములో చేసేకర్మ నాచరించవలెను. దైనిక సంధ్యావందనము లోపించినప్పుడు ఆ దైనిక కార్యానుష్ఠానము ఆనాటి రాత్రే మొదటిజాము వరకు చేసితీరవలెను.

## అశౌచమందు మానసిక సంధ్య

శ్లో॥ అర్ఘ్యాంతా మానసే సంధ్యా కుశవారి వివర్జితా।
(నిర్ణయ సింధుః)

పురుడు వచ్చినపుడుగాని, మైల వచ్చినపుడుగాని, మానసిక సంధ్యావందనము చేయాలి. ఇది ఆరంభముతో అర్ఘ్యపర్యంతము చేయ బడుతుంది. ఇందుకు కుశజల ప్రయోగము చేయరాదు.

శ్లో॥ సూతకే మృతకే వాపి ప్రాణాయామ మమంత్రకమ్।
తథా మార్జన మంత్రాంస్తు మనసోచ్చార్య మార్జయేత్॥

ప్రాణాయామము మంత్రోచ్చారణ చేయకుండానే చేయాలి. మార్జన మంత్రాన్ని మనస్సునందే ఉచ్చరించి మార్జనం చేయవలెను.

మంత్రం: గాయత్రీం సమ్యగుచ్చార్య సూర్యాయార్ఘ్యం నివేదయేత్।
మార్జనం తు న వా కార్య ముపస్థానం నచైవహి॥
[అహ్నిక సూత్రావల్యామ్॥]

గాయత్రిని స్పష్టముగా ఉచ్ఛరించి సూర్యునకు అర్ఘ్య మర్పించుము, మార్జనము చెయ్యి. చెయ్యకపోతే.... సూర్యోపస్థానము మాత్రము చేయకు. గాయత్రీ మంత్రాన్ని ఉచ్చరించి అర్ఘ్యమిచ్చే సమయాన జలాన్ని ఉపయోగించవలెను.

శ్లో॥ సూతకేతు సావిత్ర్యాంజలిం ప్రక్షిప్య ప్రదక్షిణామ్,
కృత్వా సూర్యం ధ్యాయ న్నమస్కుర్యాత్॥.
(మితాక్షరాయాం పైఠీనసిః)

అశౌచావస్థయందు కూడా సూర్యునకు నీటితో అర్ఘ్య మియ్యవలెను. ప్రదక్షిణచేసి సూర్యభగవానుని ధ్యానించి నమస్కరించ వచ్చునని పైఠీనసి ఋషి అభిమతము.

శ్లో॥ జలాభావే మహామార్గే బంధనే త్వశుచావపి,
ఉభయోః సంధ్యయోః కాలే రజసా ఽర్ఘ్య ముచ్యతే॥
(అహ్నిక సూత్రావల్యామ్]

జలాభావమందు, దీర్ఘ యాత్రయందు, ఆపదలలో చిక్కుకొన్నప్పుడూ అశౌచావస్థతోనూ ద్వికాల సంధ్యలయందు ధూళితోకూడ అర్ఘ్యమును ఇవ్వవచ్చును,

శ్లో॥ ఆపన్నశ్చాశుచిః కాలే తిష్ఠన్నపి జపేద్దశ॥
(ఆచార మయూఖే)

ఆపన్నావస్థయందున్నను అశౌచము కలిగిన పురుషునకు కూడా.... సంధ్యావందన కాలాన పదిసార్లు గాయత్రిని జపించవలెను.

శ్లో॥ యావన్న ఛిద్యతే నాలం తావన్నాప్నోతి సూతకమ్ః
ఛిన్నేనాలే తతః పశ్చాత్ సూతకం తు విధీయతే॥
[మితాక్షరాయాం జైమినిః]

బాలుడు బొడ్డు కోయకముందే మరణించినచో.... మైల అంగీకరింప బడదు. కాని.... పురుడుమాత్రము పదిరోజులు అంగీకరింప బడుతుంది.

॥ అదంత జన్మనః సద్య ఆచూడాన్నై శికే స్మృతా,
త్రిరాత్రమా వ్రతాదేశా ద్దశరాత్రమతః పరమ్॥
(యాజ్ఞవల్క్య స్మృతి)

పండ్లు వచ్చుటకు ముందు మరణించిన బాలునికై మైల.... ప్పటితోనే సరిపోతుంది. పండ్లు వచ్చినది మొదలుగా చూడాకర్మ (క్షౌర ండన) ముందు వరకు జీవించి.... ఆ తరువాత మరణిస్తే.... ఒక్కరాత్రి ౨ల పట్టాలి. చూడాకర్మానంతరం....ఉపనయనం ముందువరకు పెరిగిన ని కొరకు మూడు రాత్రుళ్ళు, ఉపనయనాంతర మైనచో.... పది జులు మైల పట్టాలని యాజ్ఞవల్క్యుని మతము.

## ఋషి, ఛందస్సు, దేవత
## [మంత్రార్థ జ్ఞాన ఆవశ్యకత]

శ్లో॥ అథ విజ్ఞాయైతాని యోఽధీతే తస్య వీర్యవద థ।
యోఽర్థ విత్తస్య వీర్యవ త్తరం భవతి జపిత్వా
హుత్వేష్ట్వా తత్ఫలేని యుజ్యతే॥ [యజుః సర్వానుక్రమ]

మంత్రముల ఋషిని, ఛందస్సును, దేవతను బాగుగా తెలిసికొని.... స్వాధ్యాయం చేసేవాని స్వాధ్యాయం బలవత్తరమౌతుంది. అంతతోనే కాక.... మంత్రార్థం తెలిసికొని ఆచరించినచో....ఆ స్వాధ్యాయం మరింత బలవత్తరం అవుతుందని యజుః సర్వానుక్రమ సూత్రమందు ఋషి మొదలుగా గల వారిని గూర్చి; నిరూపణ ప్రకరణము నారంభించి చెప్ప బడింది. అర్థజ్ఞానాన్ని పురస్కరించుకొని.... జప, హోమ, యజ్ఞములు చేసిన .... యథోక్తఫలం ప్రాప్తిస్తుంది.

శ్లో॥ ఆర్షం ఛందశ్చ దైవత్వం వినియోగ స్తథైవ చ।
వేదితవ్యం ప్రయత్నేన బ్రాహ్మణేన విశేషతః॥

అవిదిత్వా తు యః కుర్యాద్యాజనాధ్యయనం జపమ్।
హోమ మంతర్జలాదీని తస్య చాల్పఫలం భవేత్।

[యాజ్ఞవల్క్యః]

ఋషిని, ఛందస్సును, దేవతను, వినియోగమును ప్రయత్నంచేసి తెలిసికొనవలెను. ముఖ్యంగా.... బ్రాహ్మణులు విశేషరూపంగా తెలిసికోనవలెనని యాజ్ఞవల్క్యఋషి చెప్పాడు. అలా తెలిసికోకుండా.... యజన, అధ్యయన, జప, హోమాదులు ఆచరించినవాడు.... అల్పఫల ప్రాప్తార్థుడే అవుతాడు.

శ్లో॥ ఋషిణా యేన యద్దృష్టం సిద్ధిః ప్రాప్తా చ మేనవై।
మంత్రేణ తస్య తత్ప్రోక్త మృషేర్భావ స్తదార్షకమ్॥

(హేమాద్రౌ)

ఏ ఋషి.... ఏ మంత్ర సాక్షాత్కారాన్ని పొంది.... దాని ఫలితాన్ని అనుభవించాడో.... ఆ మంత్రముయొక్క ఋషి అతడుగా చెప్పబడతాడు.

## సంధ్య యందు విచారము

శ్లో॥ ప్రాఙ్ముఖః సతతం విప్రః సంధ్యోపాసన మాచరేత్।

[కూర్మపురాణే]

సంధ్యావందనము పూర్వాభిముఖుడై చేయవలెను.

శ్లో॥ ఐశా న్యాభిముఖో భూత్వా శుచిః ప్రయతమానసః।

(ఆచారదర్శే)

ఈశాన్య లేక ఉత్తర దిశలవైపు కూడ ముఖమునుంచి సంధ్యావందనము చేయవచ్చును. కాని..

శ్లో॥ ప్రక్షాళిత పాణిపాదః శుచౌదేశ ఉపవిశ్య నిత్యం బద్ధశిఖి
యజ్ఞోపవీతీ ప్రాగుదఙ్ముఖో వా భూత్వా జాన్వోరంతర్హస్తౌ
కరోత్కృత్వాఽ ఆస్యాద్రాతోసీదకై ద్విజాత యో యథా
క్రమం హ్యత్కంఠతాలుగతై ర్మాత్రామంతి॥

[కాత్యాయనోక్త గుహ్యపరిశిష్ట శౌచసూత్రే]

అర్ఘ్యం, ఉపాస్థానము, జపము మాత్రము సూర్యునకు అభిముఖంగా ముఖమునుంచి చేయవలెను. ప్రాతః సంధ్య పూర్వాభిముఖుడై చేయవలెను. సాయం సంధ్య యందలి అర్ఘ్యము, ఉపస్థాన జపాదులు పశ్చిమముగా ముఖమునుంచి చేయవలెను.

## కుశ పవిత్ర ధారణ

శ్లో॥ స్నానే దానే జపే హోమే స్వాధ్యాయే పితృకర్మణి।
జర్తా సపర్యా కుర్వీత తథా సంధ్యాభివాదనే॥
(ఆహ్నిక సూత్రవల్యామ్)

స్నాన, దాన, జప, హోమ, స్వాధ్యాయ సంధ్య, పితృకార్య, అభివాదన సమయములందు రెండు చేతులందు కుశలను ధరించవలెను.

శ్లో॥ ఉభయత్ర స్థితైర్దర్భైః సమాచామతి యో ద్విజః।
సోమపానం ఫలం తస్య భుక్త్వా యజ్ఞఫలం భవేత్॥
(ఆహ్నిక సూత్రవల్యామ్)

రెండు చేతులలోను కుశలను ధరించి.... ఆచమనము చేసేవానికి సోమపాన ఫలము ప్రాప్తిస్తుంది.

శ్లో॥ కుశాః కాశాః శరాదూర్వా యవ గోధుమ వల్వజాః।
సువర్ణం రాజతం తామ్రం దశదర్భాః ప్రకీర్తితః॥
[కాతీయ భాష్యే]

సువర్ణముగాని, వెండిగాని, రాగిగాని ఉంగరముగా చేయించుకొని.... ధరించినచో- అవి పవిత్రాలే అవుతాయి. అవి ఉచ్ఛిష్టాలైనా భయపడనవసరము లేదు.

## శిఖా-సూత్రము

శ్లో॥ సదోపవీతినా భావ్యం సదా బద్ధశిఖే తు।
విశిఖో వ్యుపవీతశ్చ యత్కరోతి న తత్కృతమ్॥
(కాత్యాయన స్మృతిః)

సంధ్యావందనారంభానికి ముందుగా గాయత్రిని ఉచ్చరించి శిఖను బంధించవలెను. సదా.... సర్వదా యజ్ఞోపవీతాన్ని ధరించ అవసరం. శిఖను బంధించకుండా, యజ్ఞోపవీతమును ధరించకు శాస్త్రీయ కర్మలు ఆచరించినా....అట్టివాడు చేయు ఆ కర్మలు చే వానితో సమానములుగానే పరిగణింపబడతాయి.

## సూర్యార్ఘ్య ప్రదానము అందరియొక్క కర్తవ్య

శ్లో॥ అస్నాయీ స మలం భుంక్తే అజపీ పూయశోణితమ్।
సూర్యా యార్ఘ్యమదత్వా తు సూర్యంహంతి స పాపత్వ।

వైదిక సంధ్యా విధానము చేయడానికి అర్హతలేని స్త్రీలుకూడ, స్నానమాచరించి సూర్యునకు అర్ఘ్యమీయవచ్చును. అర్ఘ్యమిచ్చే సమయ పఠించవలసిన మంత్రం :-

శ్లో॥ ఏహి సూర్య సహస్రాంశో తేజోరాశీ జగత్పతీ।
అనుకంపయ మాంభక్త్యా గృహాణార్ఘ్యం నమోఽస్తుతే॥

ఓ సహస్రకిరణా! ఓ తేజోపుంజా! ఓ జగత్పతీ! ఓ సూ భగవాన్! నీవు భక్తుడనైన నన్ను దయచూడు! భక్తి పూర్వకమైన అర్ఘ్యమును గ్రహించు!! నీకు నా నమస్కారములు.

సంధ్యావందన కర్తవ్యమును గూర్చి ఇంతవరకు చెప్పబడినది సంధ్యావందన విధి తెలుపు గ్రంథములు లభించగలవు. ఆ కారణం విశేషించి చెప్పలేదు. ఆత్మకల్యాణం కోరే ద్విజులు సంధ్యావందనాని ప్రయత్నపూర్వకంగా నేర్చుకోవలెను. త్రికాల సంధ్యావందనం చేయ లేకున్నచో ప్రాతఃసాయం సంధ్యలు తప్పనిసరిగా చేయవలెను.

## భగవన్నామ జపం

శ్లో॥ ఏతావానేవ లోకేఽస్మిన్ పుంసాం ధర్మపరః స్మృతః।
భక్తియోగో భగవతి తన్నామ గ్రహణాదిభిః॥ [భాగవతే]

భగవంతుని మంగళమయ నామం ఆధారంగా తీసికొని భగవ ద్భక్తిని సంపాదించడమే.... లోకమందు మానవుని ధర్మము.

శ్లో॥ సకల భువనమధ్యే నిర్ధనాస్తేఽపి ధన్యా
నివసతి హృది యేషాం శ్రీహరేర్భక్తిరేకా
హరిరపి నిజలోకం సర్వథాతో విహాయ
ప్రవిశతి హృది తేషాం భక్తి సూత్రోపనద్ధః
[భాగవత మాహాత్మ్యం]

యావత్ప్రపంచమందు హరిభక్తిగల హృదయం కలిగిన మానవుడు నిర్ధనుడైనా ధన్యుడే! భగవానుడు స్వయంగా భక్తి సూత్రంలో బంధింపబడి నిరంతరము తన లోకాన్ని విడిచి ఆ భక్తుని హృదయంలో ప్రకాశిస్తుంటాడు.

శ్లో॥ క్రియావసానే ప్రయతః స్మరేత్ ।
జప్యేనైవతు సంసిధ్యేత్ బ్రాహ్మణో నాత్ర సంశయః।
కుర్యాదన్యన్న వా కుర్యాత్ మైత్రో బ్రాహ్మణ
ఉచ్యతే ॥
(మనుస్మృతిః)

భగవన్నామ జపమూ, భగవద్విగ్రహ పూజ కథాకీర్తనాదులు చేయటమే భగవద్భక్తికి ముఖ్య సాధన రూపాలు. సామర్థ్యం చాలక.... అధికంగా చేయలేకున్నచో, సంధ్యావందనాదులు అయిన తరువాత.... నియమపూర్వకముగా నామమంత్రమును జపించవలెను.

శ్లో॥ జపస్తు సర్వధర్మేభ్యః పరమో ధర్మ ఉచ్యతే ।
అహింసయా చ భూతానాం జపయజ్ఞః ప్రవర్తతే ॥

అన్ని ధర్మములకన్న జపం ఉత్తమ ధర్మంగా చెప్పబడుతుంది. జపయజ్ఞం ప్రాణులకు పీడ కలుగకుండా సంపాదించుకోవచ్చు!

శ్లో॥ యే పాక యజ్ఞాశ్చత్వారో విధియజ్ఞ సమన్వితాః
సర్వే తే జపయజ్ఞస్య కలాం నార్హంతి షోడశీమ్॥
(మనుస్మృతిః)

బ్రహ్మయజ్ఞం కాకుండా మిగిలిన చతుష్పాక యజ్ఞములూ, అన్న, దక్షిణాయుక్తమైన అన్యాన్య యజ్ఞములు జపయజ్ఞం యొక్క పదహారవ కళతో కూడ సరిరావు!

శ్లో॥ ఆప్యాయతే యథా ధేను స్తృణై రమృత సంభవైః।
ఏవం జపైశ్చ హోమైశ్చ పునరాప్యాయతే ద్విజః॥
(ఆపస్తంబ స్మృతిః)

ఆవు అమృతముతో ఉత్పన్నమైన తృణాలతో పరిపుష్టమైనట్లే.... ఈ ద్విజజాతి జప హోమాదులతో పరిపుష్టి నందుతుంది.

శ్లో॥ యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి ।

గీతలో శ్రీకృష్ణభగవానుడు యజ్ఞాలన్నింటికన్నా జప యజ్ఞానికి ప్రాముఖ్యత కలుగజేసాడు.

శ్లో॥ అస్నాంజా స మలం భుంక్తే అజపి పూయశోణితమ్,

బద్ధకాన్ని వదలి ప్రతినిత్యం భగవన్నామాన్ని జపించడం కర్తవ్యమై ఉన్నది.

శ్లో॥ చక్రాయుధస్య నామాని సదా సర్వత్ర కీర్తయేత్,
నశౌచం కీర్తనే తస్య స పవిత్ర కరోయతః॥
(విష్ణు ధర్మోత్తరే)

విశిష్టమైన బీజ, శక్తి, కీలకాది యుక్తమైన నామమంత్ర జపం ఆసనంపై కూర్చొని.... శుభ్రంగా పవిత్రతతో విధివిధానంగా జరిపించవలెను. 'రామ, కృష్ణ, శివ' ఆదిగా గల భగవంతుని నామాలను సర్వకాల సర్వావస్థలయందును ఉచ్చరించవచ్చును.

శ్లో॥ జపేన దేవాతానిత్యం స్తూయమానా ప్రసీదతి,
ప్రసన్నే విపులాన్గోత్రాన్ప్రాప్నువంతి మనీషిణః॥
రాక్షసాశ్చ పిశాచాశ్చ మహాసర్పాశ్చ భీషణాః।
జపితాన్నోపిసర్పంతి దూరాదేవ ప్రయాంతితే॥
ఛంద ఋష్యాది విజ్ఞాయ జపేన్మంత్ర మతంత్రితః।
(హారీత స్మృతిః)

జపించే వారిపై దేవతలు సదా ప్రసన్నులై ఉంటారు. వారు ప్రసన్నులైతే విపులమైన వంశవృద్ధి, ధనధాన్యములు ప్రాప్తిస్తాయి. భూత,

ప్రేత, భయంకర సర్పాదులవల్ల భయము కలుగదు. అవి భగవన్నా మాన్ని జపించేవారి వద్దకు రావు ! ఛందో ఋషులను తెలిసికొని చేసే జపము ఉత్తమము.

## ఆరోగ్యమును కాపాడుకొనుట

**శ్లో॥ శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్।**

కేవలం లోక సుఖాలకే కాక.... ఆధ్యాత్మిక వికాసం కొరకు శరీరారోగ్యమును కాపాడుకోవలెను. ధర్మ సంపాదనకు శరీరమే ప్రధాన సాధనము.

**శ్లో॥ నాఽయ మాత్మాబలహీనేన లభ్యః।**

దుర్బలుడు ఆత్మసాక్షాత్కారం పొందలేడు!

భగవద్పూజనానంతరం యథాశక్తి వ్యాయామము చేయవలెను. యోగాసనాభ్యాసం చేసినచో.... శరీరం ఆరోగ్యంగా ఉండటమే గాక, స్మరణ ఉపాసనలందు చాల ఉపయోగిస్తుంది. శౌచ స్నానానంతరం సంధ్యావందనానికి ముందుగా.... యోగాసనాలు చేయవలెను.

## బలి వైశ్వదేవము

**శ్లో॥ పంచ సూనా గృహస్థస్య చుల్లీ పేషణ్యుపస్కరః।**
**కణ్డనీ చోదకుంభశ్చ బధ్యతే యాస్తు వాహయన్॥**
**తాసాం క్రమేణ సర్వాసాం నిష్కృత్యర్థం మహర్షిభిః।**
**పంచక్లుప్తా మహాయజ్ఞాః ప్రత్యహం గృహమేధినామ్॥**

[మనుస్మృతిః]

ప్రతి గృహస్థువద్ద పొయ్యి, తిరుగలి, చీపురు, రోలు, నీటికుండ: యీ అయిదూ.... హింసాస్థానాలై ఉంటాయి. వాటిని ఉపయోగించే సమయాన తెలియకుండా- ఇచ్ఛలేకనే జీవహింస జరుగక మానదు! ఆ హింసాదోషాన్ని దూరం చేసికొనేందుకు పంచమహా యజ్ఞాలు చెప్పబడ్డాయి.

శ్లో॥ పంచయజ్ఞ విధానం తు గృహీ నిత్యం న హాపయేత్।
పంచయజ్ఞ విధానేన తత్పాపం తస్య నశ్యతి॥
[శంఖ స్మృతిః]

గృహస్థాశ్రమం స్వీకరించినవాడు.... పంచయజ్ఞ విధానాలను ఉల్లంఘించరాదు! వాటిని ఆచరించటానికి.... సర్వవిధాల ప్రయత్నం చేయవలెను. ఎందుచేత ననగా.... గృహస్థ ధర్మమందు తప్పకుండా, తెలియకుండా.... జరిగే హింసాది పాపముల శాంతినిమిత్తం పంచమహా యజ్ఞములు చెప్పబడ్డాయి.

శ్లో॥ దేవయజ్ఞో భూతయజ్ఞః పితృయజ్ఞస్తథైవ చ।
బ్రహ్మయజ్ఞో నృయజ్ఞశ్చ పంచయజ్ఞాః ప్రకీర్తితాః॥
(శంఖ స్మృతిః)

దేవయజ్ఞ, భూతయజ్ఞ, పితృయజ్ఞ, నృయజ్ఞ, బ్రహ్మయజ్ఞాలని యజ్ఞాలు ఐదు విధాలుగా ఉన్నాయి.

ప్రతిదినం వేదమును స్వాధ్యాయం చేసినచో బ్రహ్మయజ్ఞం సిద్ధిస్తుంది. కాని.... వేదములు కాక, పురాణ, మహాభారత, అధ్యాత్మ విద్య, గీత, ఉపనిషత్తులు మొదలగునవి పఠించినను, విన్ననూ.... బ్రహ్మ యజ్ఞం సిద్ధిస్తుందని యాజ్ఞవల్క్య ఋషి అన్నాడు. అది చేయనినాడు.... గాయత్రీ జపంతోకూడ బ్రహ్మయజ్ఞం పూర్తి కాగలదు. అంతేకాకుండా... సత్సంగములో కూడిన శాస్త్ర చర్చ సాగినవాడుకూడ బ్రహ్మయజ్ఞమే కాగలదు.

బ్రహ్మ యజ్ఞం మినహాయించి.... మిగిలిన నాలుగు యజ్ఞాలూ సంక్షేపంగా బలివైశ్వ దేవాంతర్గతమయ్యే ఉంటాయి.

బలివైశ్వదేవం ప్రతిరోజూ ఒకమారే జరుగుతుంది! శ్రాద్ధ దినం నాడు అగ్నిహోత్రం చేసేవాడు, శ్రాద్ధానికి ముందు అగ్నిహోత్రి కాని వాడు.... శ్రాద్ధానంతరం బలివైశ్వదేవాదులు చేయవలెను! జాతాశౌచ, మృతాశౌచముల యందు బలివైశ్వదేవాదులు చేయరాదు!! సౌరాభావ

మందు అమాన్న ఫలాలు, శాకాలు బలి వైశ్వదేవానికి ఉపయోగించవచ్చు. ఇందులో మినుము, సెనగ, ఒక విధమైన ఎఱ్ఱని అన్నము (మసూర), కొఱ్ఱ, బటానీ, లవణము, నూనెతో చేసినవి, పాడైపోయినవి, భుక్త శేషాన్నములు వర్జించాలి.

శ్లో॥ అకృతే వైశ్వదేవేఽపి భిక్షౌ చ గృహమాగతే।
ఉద్ధృత్య వైశ్వదేవార్థం భిక్షాం దత్వా విసర్జయేత్॥
వైశ్వదేవా కృతాన్దోషా ఞ్చక్తో భిక్షుర్వ్యపోహతుమ్।
నహి భిక్షుకృతాద్దోషా న్వైశ్వదేవో వ్యపోహతి॥
(హారీత స్మృతిః)

వైశ్వదేవానికి ముందు భిక్షార్థము అభ్యాగతి; యతి ఎవరైనా వచ్చినచో....వైశ్వదేవముకొరకు అన్నము వేతేతీసి, ఆ వచ్చినవారికి భిక్ష ఇవ్వవలెను. వైశ్వదేవము చేయనితో కలిగే దోషము సన్యాసిదూరము చేయగలడు గాని.... వైశ్వదేవము దూరము చేయలేడు. అన్నదమ్ము లిద్దరూ విడిపోయినచో....వారిద్దరూ విడివిడిగానే శ్రాద్ధము, బలి వైశ్వదేవాదులు చేయవలెను.

శ్లో॥ ఏకపాకే నివసతాం పితృదేవ ద్విజార్చనమ్।
ఏకం భవేద్ విభక్తానాం తదేవస్యాద్ గృహే గృహే॥
(ఛందోగ పరిశిష్టే)

ఒకే పాకమైతే....వారిలో జ్యేష్ఠుడే చేయవలెను. వేఱు కానప్పటికి....ఎవరైనా ఒక సోదరుడు పరదేశములో ఉంటే....ఆతను విడిగా శ్రాద్ధ,బలి వైశ్వదేవాదులు చేయవలెను.

శ్లో॥ యజ్ఞశిష్టాశినం సంతోముచ్యంతే సర్వకిల్బిషైః।
భుజ్ఞతే తే త్వఘం పాపాయే పచం త్యాత్మ కారణాత్॥
(గీతా)

ప్రతి నిత్యం బలి వైశ్వ దేవాదులు చేసినచో....మానవుని సర్వపాపములు నశిస్తాయి.బలివైశ్వదేవాదులు చేయగా....మిగిలినఅన్నము

యజ్ఞశిష్టాన్నము. ఇది అమృతతుల్యముగా అంగీకరింపబడుతుంది. తన స్వయముగా అన్నము వండుకొనేవాడు పాపిగా పరిగణింపబడతాడు.

శ్లో॥ ఏవం యః సర్వభూతాని బ్రాహ్మణో నిత్యమర్చతి
స గచ్ఛతి పరం స్థానం తేజోమూర్తి పథర్జునా॥
(మనుస్మృతి)

నిత్యము బలి వైశ్వదేవాదులు ఆచరిస్తూ....అన్నదానాదుల ద్వారా ప్రాణికోటిని పూజించే బ్రాహ్మణులు అర్చిరాది మార్గముగా బ్రహ్మలో ప్రాప్తి నందుతారు.

శ్లో॥ సాయం త్వన్నస్య సిద్ధస్య పత్న్యమంత్రం బలింహరేత్
వైశ్వదేవం హినా మైతత్సాయం ప్రాతర్విధీయతే॥
(మనుస్మృతి)

సాయముకాలివేళ భార్య యే మంత్రాలు లేకుండానే బలి వైశ్వదేవ కర్మలు చేయవలెను. గృహస్థు కొరకు వైశ్వదేవ కర్మకు ఉపదేశమున్నది. బలి వైశ్య దేవవిధిని చెప్పు గ్రంథములు సులభముగా లభింపగలవు. ఆ కారణముచేత ఈ విషయమై ఇక్కడ విపులముగా చెప్పుట లేదు. బలివైశ్వదేవాదులు తప్పక ఆచరించవలెను. ఇవి ఆచరించుట వలన....ఆహారశుద్ధి కలుగును.

## అతిథి సత్కారము

శ్లో॥ కృత్వైతద్బలికర్మైవ మతిథిం పూర్వమాశయేత్।
భిక్షాంచ భిక్షవే దద్యా ద్విధివత్ బ్రహ్మచారిణే॥
(మనుస్మృతిః)

విధి విధానముగా బలివైశ్వదేవాదులు అయిన తరువాత.... ముందుగా అతిథికి భోజనము పెట్టాలి. సన్యాసికాని, బ్రహ్మచారికాని.... భిక్షకోసము వచ్చినచో విధి.. పూర్వకముగా వారికి భిక్ష ఇవ్వవలెను.

శ్లో॥ వైశ్వానరః ప్రవిశత్యతిథి బ్రాహ్మణోగృహాన్।
తస్మై తాగుం శాంతిం కుర్వంతి హరవైవస్వతోదకమ్॥

ఆశా ప్రతీక్షే సంగతగ్ం సూనృతాం చ
ఇష్టాపూర్తే పుత్రపశూంశ్చ సర్వాన్॥
ఏతద్ వృంక్తే పురుష స్యాల్ప మేధసో
యస్యానశ్న న్వసతి బ్రాహ్మణో గృహే॥
(కఠోపనిషత్)

బ్రాహ్మణాతిథి రూపములో సాక్షాత్తూ వైశ్వానరాగ్ని గృహాలకు రావచ్చు! సత్పురుషులు.... అర్ఘ్యపాద్యాది విధులతో అతన్ని శాంతి పఱు స్తారు. బ్రాహ్మణుడు, అతిథి లేకుండా భోజనం చేసేవాడి ఆశలూ, కోరి కలూ; ఇష్ట సంయోగముతో ప్రాప్తించే ఫలములూ, మధుర వాక్ఫలిత ములు; యాగాది ఇష్టకర్మలవలన, వనప్రతిష్ఠాది పూర్వకర్మల వలన లభించే ఫలితములూ; పుత్రసంతానము, పశువులూ ఆదిగాగలవి నశిస్తాయి.

శ్లో॥ తృణాని భూమిరుదకం వాక్చతుర్థీ చ సూనృతా।
ఏతాన్యపి సతాం గేహే నోచ్ఛిద్యంతే కదాచన॥
(మనుస్మృతిః)

ఆ కారణముచేత.... సత్పురుషుల ఇంటిలో అతిథి సత్కారార్థమై భూమి, ఆసనము, నీరు, మధుర వచనము ఈ నాలుగూ లోపించవు. అనగా.... లోపించరాదు.

శ్లో॥ స్వాగతేనాగ్నయస్తుష్టా భవంతి గృహమేధినః।
ఆసనేన తు దత్తేన ప్రీతో భవతి దేవరాట్॥
పాదశౌచేన పితరః ప్రీతిమాయాంతి దుర్లభామ్।
అన్నదానేన యుక్తేన తృప్యతే హి ప్రజాపతిః॥
తస్మా దతిథయే కార్యం పూజనం గృహమేధినా॥
(హారీత స్మృతిః)

అతిథిని ఆహ్వానిస్తే.... ఆ గృహస్థుపై అగ్ని సంతుష్టి చెందుతాడు. గౌరవముగా ఆసనము సమర్పిస్తే.... ఇంద్రుడు ప్రసన్నుడౌతాడు. పాద ప్రక్షాళనమువలన పితరులు ప్రీతినందుతారు. ఇక.... భోజనము పెట్టి, అతి థిని తృప్తిపరిస్తే.... సాక్షాత్తూ ప్రజాపతే తృప్తి నందుతాడు.

కనుక....అతిథి సత్కారము గృహస్థునకు పరమ కర్తవ్యమైనదిగా చెప్ప బడినది.

## భోజన విధి

శ్లో॥ సువాసినీం కుమారీం చ భోజయిత్వా నరా నపి,
బాలవృద్ధాస్తతః శేషం స్వయం భుంజీత వా గృహీ॥
ప్రాఙ్ముఖో వాపి ప్రాఙ్నీ చ మితభాషిణః।
అన్నమాదౌ నమస్కృత్య ప్రహృష్టే నాంతరాత్మనా॥
పంచప్రాణాహుతీః కుర్యా న్మంత్రేణ చ పృథక్ -
పృథక్,
తతః స్వాదుకరాన్నం చ భుంజీత సుసమాహితః॥
(హారీతస్మృతిః)

సువాసినీ స్త్రీలకూ, కుమారీ కన్యలకూ, బాలకులకూ, వృద్ధ జనులకూ భోజనము పెట్టి....మిగిలిన దానిని గృహస్థు భుజించవలెను. పూర్వాభిముఖముగా గాని లేక ఉత్తరాభిముఖముగా గాని ముఖము నుంచి; ఇంద్రియ నిగ్రహముతో ప్రప్రథమముగా అన్నమునకు నమస్కరించి, తరువాత....ప్రసన్నుడై; పంచ ప్రాణాహుతులు పుచ్చుకొని, సమాహిత చిత్తముతో భోజనము చేయవలెను.

శ్లో॥ సాయం ప్రాత ర్ద్విజాతీనా మశనం శ్రుతిచోదితమ్,
నాంతరా భోజనం కుర్యా దగ్నిహోత్ర సమోవిధిః॥

ప్రాతః సాయంకాలాలు రెండే బ్రాహ్మణులకు భోజనకాలాలు! వారు ఆ రెండు పూటలే భోజనము స్వీకరించాలి! ఇక....మధ్యలో భోజ నము చేయరాదు. విధిపూర్వకముగా అలా చేస్తే....అట్టివానికి అగ్ని హోత్రము చేస్తే కలిగే పుణ్యము ప్రాప్తిస్తుంది.

ముందుగా "నమో భగవతే వాసుదేవాయ" అనే మంత్రాన్ని పఠించి, తనముందు నీటితో నాలుగంగుళాల చతుష్కోణ మంటపము చేసి దానిమీద భోజన పాత్రనుంచి; అందులో....నేతితో కూడిన పదార్థములు వడ్డన చేయవలెను. జలపాత్ర కుడివైపున ఉంచుకోవలెను. ఆ తరువాత.... భగవద్బుద్ధితో అన్నమునకు నమస్కారము చేసి-క్రింది (మం) చదవాలి,

మంత్రం: బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్।
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా॥

స్రుక్, స్రువాది అర్పణమే బ్రహ్మము! హవిర్భాగము కూడ బ్రహ్మమే! హవనము చేయబడే అగ్నికూడ బ్రహ్మమే!! కర్త, హవనరూపమైన క్రియకూడ బ్రహ్మ!!! ఆ బ్రహ్మరూప కర్మయందు స్థితుడైన పురుషుని ద్వారా పొందబడే యోగ్యమైన ఫలముకూడ బ్రహ్మమే!!!!

మంత్రం: త్వదీయం వస్తు గోవింద తుభ్యమేవ సమర్పయే,
గృహాణ సుముఖో భూత్వా ప్రసీద పరమేశ్వర॥

అనే మంత్రము ద్వారా...."ఓ గోవిందా! నీ వస్తువును నీకే అర్పిస్తాను. నీవు నాయందు ప్రసన్నుడవై, ప్రసన్న ముఖముతో దీనిని గ్రహించు!" అనిపఠించి....అన్నమందు తులసీ దళమును విడచి; జలముతో అన్నమును భగవంతునికి అర్పించవలెను. గంగాజలముతో అర్పిస్తే.... చాలమంచిది ముందుగా....ఆ జలముతో ప్రోక్షణచేసి; తులసీదళము వేయవలెను. తిరిగి....రెండు చేతులతోను అన్నముపైన కప్పి,యజ్ఞోపవీతులు-

మంత్రం : ఓం నాభ్యా ఆసీదంతరిక్షగ్ం శీర్ష్ణో ద్యౌః సమవర్తత,
పద్భ్యాం భూమిర్దిశః శ్రోత్రా త్తథాలోకాగ్ం అకల్పయన్॥

అనే మంత్రాన్ని పఠించవలెను.

పరమేశ్వరుని నాభినుండి- అంతరిక్షము, శిరస్సునుండి- ద్యులోకము, పాదాలనుండి- భూలోకము, కర్ణములనుండి- దిశలూ ఉద్భవించాయి. ఈ విధముగా .. పరాత్పరుడు సమస్త లోకాలను సృజించాడు.

ఆ తరువాత...."అమృతోపస్తరణమసి స్వాహా" అనే మంత్రముతో ఆచమనముచేసి, 50వ పుటలోని మంత్రముతో ఒక్కొక్క గ్రాసము తినవలెను.

**మంత్రం :** ఓం ప్రాణాయ స్వాహా, ఓం అపానాయ స్వాహా,
ఓం వ్యానాయ స్వాహా, ఓం ఉదానాయ స్వాహా,
ఓం సమానాయ స్వాహా!

గ్రాసము ఒక్కొక్కటి- రేగు పండంత లేక ఉసిరికాయంతగాని ఉండవలెను. కాని... ఒక్క విషయము- ఆ గ్రాసమును....దంతములతో నమలక- నాలుకతో లోపికి మింగవలెను.

ఆ తరువాత.... తిరిగి ఆచమనముచేసి; భోజనము చేయుము భోజనము చేసిన తరువాత.... "అమృతాపి ధానమసి స్వాహా" అనే మంత్రముతో ఆచమనముచేసి; ముఖమును శుభ్రపఱచుకోవలెను. తడిసిన చేతులను....అటిచేతులతో రాచి; నిమ్నలిఖిత మంత్రాన్ని పఠిస్తూ.... అటి చేతులను కళ్ళపై ఉద్దుకోవలెను.

శ్లో॥ శర్యాతిం చ సుకన్యాం చ చ్యవనం శక్ర మశ్వినౌ,
భోజనాంతే స్మరే న్నిత్యం తస్య చక్షుర్న హీయతే॥

శర్యాతి, సుకన్య, చ్యవన, ఇంద్ర, అశ్వినీ కుమారులను .. భోజనము చేసిన తరువాత....స్మరించినవాని నేత్రజ్యోతి క్షీణించదు. భుజించిన ఆహారము చక్కగా జీర్ణమగుటకు....క్రింది శ్లోకము చదువవలెను.

శ్లో॥ అగస్త్యం వైనతేయఞ్చ శనిఞ్చ బడబానలమ్
ఆహార పరిపాకార్థం స్మరే ద్భీమ ఞ్చ పఞ్చమమ్,

అగస్త్య, గరుడ, శని, బడబానల, భీమ ఈ ఐదుగురినీ.... భుజించిన ఆహారము జీర్ణము కావటానికి స్మరించవలెను.

పోష్యవర్గమును భరించి, పోషించటం .. స్వర్గసాధనము!

శ్లో॥ భరణం పోష్యవర్గస్య ప్రశస్తం స్వర్గసాధనమ్,
నరకః పీడనే తస్య తస్మాద్యత్నేన తం భరేత్॥

(దక్షస్మృతిః)

స్త్రీ-పుత్ర, తల్లిదండ్రులను, వివరాలైన అనాథయైన సోదరిని, సేవకులను మరియు ఆశ్రితజనులను భరించి, పోషించుట.... స్వర్గము

చేరుకునేందుకు ప్రశస్తమైన సాధనముగా చెప్పబడినది. వారిని పీడించుట వలన నరకమార్గము ప్రాప్తిస్తుంది. ఆ కారణముచేత ....ప్రయత్నము చేసి....వారిని పోషించి, పాలించవలెను.

## వ్యవహారమును ధర్మానుకూలముగా తయారు చేసికోవలెను

శ్లో॥ అహింసా సత్య మస్తేయం శౌచ మింద్రియ నిగ్రహః।
ఏతం సామాసికం ధర్మం చాతుర్వర్ణ్యేఽబ్రవీన్మను॥
(మనుస్మృతిః)

ప్రవృత్తి మార్గమందు స్థితుడైన పురుషుడు ... అర్థోపార్జనయందు, తదితర వ్యవహారములందు లగ్నము కావలసి వస్తుంది. లగ్నమై తీరాలి! కాని...వ్యవహారము- ధర్మానుకూలముగా ఉండేలా మాత్రము ప్రయత్నము చేయవలెను!! అహింస, సత్యము, ఇతరుల సొత్తులను లాక్కొనకపోవుట, పవిత్రముగా ఉండుట, ఇంద్రియ నిగ్రహము కలిగి ఉండుట అనే ఈ ఐదు నియమాలను....ప్రయత్నపూర్వకముగా నిర్వర్తించవలెను!

శ్లో॥ గురుభక్తో భృత్యపోషీ దయావా ననసూయకః।
నిత్య జాపీ చ హోమీ చ సత్యవాదీ జితేంద్రియః॥
స్వదారే యస్య సంతోషః పరదార నివర్తనమ్।
అపవాదోఽపినో యస్య తస్య తీర్థఫలం గృహే॥

ఎవడు గురుభక్తుడై.... భృత్యులను- పుత్రులవలె పాలించునో.... వాడునూ; దయామయుడు, ఇతరుల గుణములందు దోషములను యెంచనివాడునూ; ప్రతినిత్యము మంత్రమును జపించేవాడూ, హవన మాచరించేవాడూ, సత్యభాషి, జితేంద్రియుడూ, తన భార్యయందు ప్రేమగలవాడూ, పరస్త్రీని గూర్చి...ఆలోచించనివాడూ, లోకమందు యెవరిచేతను నిందించబడనివాడూ స్వగృహమునందే ఉన్ననూ.... అతనికి సర్వతీర్థాలు సేవించినంత పుణ్యము ప్రాప్తిస్తుంది.

శ్లో॥ పరదారా న్పరద్రవ్యం హరితే యో దినే దినే
సర్వతీర్థాభిషేకేణ పాపం తస్య న విశ్యతి॥
(వ్యాసస్మృతిః)

నిరంతరము....ఇతరుల అధికారాన్ని అపహరించుదామనుకొనే వాడూ, పరస్త్రీ సంభోగాసక్తుడై ఉండేవాడూ...తీర్థయాత్రలు అన్నీ చేసినా, వానిలో స్నానము చేసినా...వాని పాపములు నశించవు.

శ్లో॥ ఋతుకాలాభిగామి స్యాత్స్వదార నిరతః సదా,
పర్వవర్జం వ్రజేచ్చైనాం తత్ వ్రతో రతికామ్యయా॥
(మనుస్మృతిః)

తన ధర్మపత్నితోకూడ... అమావాస్యాది పర్వదినములు విడిచి పెట్టి; ఋతుకాలమందే సంబంధము కలిగి ఉండాలి! భార్యను సంతోష పెట్టాలని, ఋతుకాలమందువలె, ఇతర కాలమున- సంబంధము కలిగి ఉండకుము.

శ్లో॥ అమావాస్యా మష్టమీ చ పౌర్ణమాసీం చతుర్దశీమ్,
బ్రహ్మచారీ భవేన్నిత్య మప్యృతౌ స్నాతకోద్విజః
(మనుస్మృతిః)

ఋతుకాలమందుకూడ....అమావాస్య, అష్టమీ, పూర్ణిమ మరియు చతుర్దశి దినములు- స్నాతక ద్విజునకు....గృహస్థాశ్రమమునందు ఉన్న ప్పటికినీ....బ్రహ్మచర్యపాలన చేయదగినవి.

శ్లో॥ శబ్దాదీన్విషయానన్య ఇంద్రియాగ్నిషు జుహ్వతి॥

అలా ఆచరించిననాడు... ఆ గృహస్థు పుణ్యభాగస్వామి అవుతాడు! గీతయందు కృష్ణభగవానుడు .... అనేకములైన యజ్ఞములను వర్ణించి చెబుతూ....ఇంద్రియ రూపమైన అగ్నియందు, విషయరూపమైన హవి స్సును అర్పించుటకూడ.... ఒక యజ్ఞమని చెప్పాడు.

## యమ-నియమ పాలనము

శ్లో॥ స్నానం మౌనోపవాసేజ్యా స్వాధ్యాయోపస్థ నిగ్రహాః,
నియమో గురుశుశ్రూషా శౌచా క్రోధా ప్రమాదతా॥
(యాజ్ఞవల్క్య)

స్నానము, వాచంయమము, ఉపవాసము, యజనము, స్వాధ్యాయము, జననేంద్రియ నిగ్రహము, గురుసేవ, శౌచాచారము, క్రోధాభావము, ప్రమాద త్యాగము అనే....పది విషయాలను నియమపాలనకు చెప్పుచున్నారు.

శ్లో॥ బ్రహ్మచర్యం దయా క్షాంతిర్ధ్యానం సత్య మకల్మషా।
అహింసాఽస్తేయ మాధుర్యే దమశ్చేతి యమాః
స్మృతాః॥ (యాజ్ఞవల్క్యః)

ఒకవేళ....వీటిని ఆచరించుటలో లోపము జరిగిన.... బ్రహ్మచర్యము, దయ, క్షమ, భగవత్ ధ్యానము, సత్యభాషణము, పాప పరివర్జనము, అహింస, ఇతరుల అధికారమును అపహరించకపోవుట, విశేషించి నమ్రుడై యుండుట, మనో నిగ్రహము....అనే....పది నియమములను....పూర్ణప్రయత్నముతో ఆచరణ చేయవలెను.

శ్లో॥ యమాన్సేవేత సతతం న నిత్యం నియమాన్ బుధః।
యమాన్పతత్యకుర్వాణో నియమాన్ కేవలాన్ భజన్॥
(మనుస్మృతిః)

ఇంతకూ.... అభిప్రాయమేమిటంటే.... యమపాలనయందు సమర్థుడై పనిచేయువాడు నియమపాలనయందు ఎప్పుడైన చ్యుతుడైనచో.... తిరిగి అట్టి స్థితిని పొందగలడు! కాని.... యమపాలనయందు ప్రమాదము చేసినవాడు నియమపాలన చేసినా.... సన్మార్గమునుండి పతనుడే అవుతాడు!! కావున....యమపాలన- నియమపాలన కన్నను మిన్నయైనదిగా చెప్పబడినది.

శ్లో॥ త్రివిధం నరక స్యేదం ద్వారం నాశన మాత్మనః।
కామః క్రోధ స్తథా లోభ స్తస్మాదేతత్రయం త్యజేత్॥(గీతా)

కామ, క్రోధ, లోభాలు ఆత్మను అధోగతిపాలు చేయగల నరక ద్వారాలని గీతలో చెప్పబడినది. "ఈ మూడున్నూ.... పతన కారకములైన పది దోషాలపెట్టు" అని గీత అంటున్నది. ఆ కారణముచేత.... ఈ మూడింటిని త్యజించవలెను.

అంతఃకరణయందు ఈ దోషత్రయము ప్రబలమైనప్పుడు .... మనోవాక్కాయ దోషాలు ఉత్పన్నమౌతాయి.

శ్లో॥ పరద్రవ్యే ష్వభిధ్యానం మనసానిష్ట చింతనమ్,
వితథాభి నివేశశ్చ త్రివిధం కర్మమానసమ్॥

(మనుస్మృతిః)

ఇతరుల ధనాన్ని అపహరించటం ఎలాగా అని; ఇతరులకు హాని కలిగించాలని....కోరిక కలిగియుండుట; పరలోక, పరమేశ్వరులయందు విశ్వాసము లేకుండా....దృశ్య జగత్తునే సర్వస్వమని తలచుట, ఎంచుట అనేవి త్రివిధ మానసిక దోషాలు!

శ్లో॥ పారుష్య మనృతం చైవ పైశున్యం చాపి సర్వశః,
అసంబద్ధ ప్రలాపశ్చ వాఙ్మయం స్యాచ్చతుర్విధమ్॥

(మనుస్మృతిః)

కఠోరముగా మాట్లాడటం, అబద్ధములాడటం, ఇతరులపై నేరములు మోపుట, ఆ విధముగానే....లౌకిక వార్తలు ప్రచారము చెయ్యటం; ఈ నాలుగూ వాక్సంబంధమైన దోషాలు!

శ్లో॥ అదత్తానా ముపాదానం హింసా చైవా విధానతః।
పరదారోపసేవా చ శారీరం త్రివిధం స్మృతమ్॥(మను॥)

ఇవ్వకుండా, అనుమతి లేకుండా ఇతరుల వస్తువులను తీసికొని వాడుకోవటం; జిహ్వా చాపల్యముచే.... జీవులను హింసించటం, అలా కాకపోతే.... నిరపరాధులను పీడించటం; అట్లే.... పరస్త్రీ సంబంధము కలిగించుకోవటం; ఇవి- శారీరక దోషాలుగా పరిగణించబడ్డాయి. అంటే... పాపాలు చేయరాదంటున్నది మనుస్మృతి!

## అభివాదన శీలత

శ్లో॥ అభివాదన శీలస్య నిత్యం వృద్ధోపసేవినః,
చత్వారి తస్య వర్ధంతే ఆయుర్విద్యా యశోబలమ్॥ (మను॥)

పెద్దవారు ఎవరైనా ఎదురైతే ప్రణామము చేయవలెను! పిన్నలపై స్నేహభావ ప్రకటన చేయుచుండవలెను!! సమవయస్కులతో యథాయోగ్యముగా నమస్కార క్రియ జరుపవలెను!!! జ్ఞానులను, వృద్ధులను నిరంతరము సేవించుచుండవలెను!!!! వీటిని ఆచరించినచో.... ఆయుష్షు, విద్య, యశస్సు, బలము వృద్ధి పొందుతాయి.

## సాయంకృత్యము

నిరంతరము సావధానముగా ఉంటూ.... వ్యవహారములను ధర్మానుకూలముగా చేసికోవలెను. ధర్మార్థాలను సంపాదిస్తూ....పగటికి తరువాత సాయంసంధ్యను, సాయంకృత్యములను ఆచరించవలెను.

## సంధ్యాదీప స్థాపనము

సూర్యాస్తమయము అయిన తరువాత.... ఇంటియందు నేతి దీపమును వెలిగించవలెను. ఈ క్రింది మంత్రముతో- ఆ దీపమును స్తుతి చేయవలెను.

శ్లో॥ దీపోజ్యోతిః పరబ్రహ్మ దీపోర్జ్యోతి జనార్దనః।
దీపో హరతు మే పాపం సంధ్యాదీపం నమోస్తుతే॥
శుభం కరోతు కల్యాణ మారోగ్యం సుఖ సంపదమ్।
శత్రుబుద్ధి వినాశం చ దీపజ్యోతి ర్నమోఽస్తుతే॥

జ్యోతి స్వరూపమైన దీపము పరబ్రహ్మ! అది జనార్దనుని రూపము! ఓ సంధ్యాదీపమా! నీకు నమస్కారములు! మా పాపములను దూరము చేయి! శుభమును, కల్యాణమును, ఆరోగ్యమును, సుఖ-సంపత్తులను, శత్రుబుద్ధి వినాశమును కలుగజేయి!! ఓ జ్యోతి స్వరూపమైన దీపమా! నీకు నమస్కారములు!

శ్లో॥ రవేరస్తం సమారభ్య యావత్సూర్యోదయో భవేత్।
యస్య తిష్ఠేత్ గృహే దీపస్తస్య నాస్తి దరిద్రతా॥
(ఆహ్నిక సూత్రవల్యామ్)

ఈ ప్రకారముగా....దీపమునకు నమస్కరించి, అక్కడ పూజ్య పురుషులు ఉపస్థితులైనచో.... వారికి- నమస్కరించవలెను. సూర్యాస్తమయము మొదలు....సూర్యోదయము వఱకు దీపము వెలిగే గృహమునందు దారిద్ర్యము ఉండదుగాక....ఉండదు!

## తులసీ సేవనము

ప్రతి గృహస్థు తన గృహమునందు తులసి మొక్కను తప్పని సరిగా నాటుకోవలెను. తులసీపూజ స్త్రీలకు సుఖ-సౌభాగ్యాలను, వ్యక్తిని

కలుగజేస్తుంది! సాయంకాలమున తులసివద్ద దీపస్థాపన చేసిన.... అది చాల మంగళదాయక మంటారు.

## రాత్రి భోజనము-శయనము

శ్లో॥ మాంగల్యం పూర్ణకుంభం చ శిరఃస్థానే నిధాపయేత్,
రాత్రిసూక్తం జపన్ రాత్రౌరాత్రిక్షేమో భవేన్నరః॥
(మాత్స్య)

సాయంకృత్యానంతరము ప్రేమపూర్వకముగా తన కుటుంబ పరివారముతో భోజన మారగించవలెను. నిద్రించే సమయాన నీటితోనిండిన పాత్రను శిరస్సుక్రింద ఉంచుకోవలెను. జరిగేటట్లైతే.... రాత్రి సూక్తము పఠించి; భగవంతుని ధ్యానించవలెను.

మరల....శాంతచిత్తముతో-ఈ మంత్రమును జపించి; తూర్పుగాగాని, దక్షిణముగాగాని ...శిరస్సునుంచి; పరుండి నిద్రించవలెను.

శ్లో॥ అగస్తి ర్మాధవశ్చైవ ముచుకున్దో మహాబలః,
కపిలో ముని రాస్తీకః పంచైతే సుఖశాయినః॥

అగస్తి, మాధవ, మహాబలశాలియైన ముచుకుందుడు, కపిలముని, ఆస్తీకుడు- ఈ ఐదుగురూ....సుఖపూర్వకముగా నిద్రించేవారు.

## సదాచారపాలనము అనివార్యము

శ్లో॥ భవతు నిశ్చయదార్ఢ్యా దూర్ధ్వం శాస్త్రరక్షణమ్।
అన్యథా పాతిత్యాశంకయా॥ [నారద భక్తిసూత్రః]

కావలసినవారికి....భక్తిమార్గము అవలంబించినా, జ్ఞానమార్గము అవలంబించినా....సదాచారపాలనము- అనివార్యము, ఉపకారము చేయునదికూడ అయి యున్నది.

శ్లో॥ సర్వాపేక్షా చ...

నారదుడు- భక్తి సూత్రమునందు, వ్యాసభగవానుడు- బ్రహ్మసూత్రములందు ఈ విషయాన్ని గూర్చి స్పష్టముగాను, ఎక్కువగాను తెలియచేసారు.

## అధ్యాయము - 2

శ్రీ పరబ్రహ్మణే నమః!

# ఈశ్వరుడు - కర్మఫలము

## పూర్వజన్మ-పరజన్మ

ప్రపంచములో ప్రతిజీవీ సుఖము-దుఃఖము అనుభవిస్తుంది. జన్మ ప్రభృతి సుఖము-దుఃఖము ఆరంభమౌతుంది. ఇందులో కూడ తారతమ్య మున్నది. ఒకజీవి జన్మిస్తూనే సుఖిస్తుంది. ఎయిర్ కండిషన్ రూమ్‌లో జన్మిస్తుంది. డాక్టర్స్, లేడీడాక్టర్స్, నర్సులు, బంధువర్గము ఆబిడ్డ సేవకు సిద్ధముగా ఉంటారు. క్షణక్షణానికి బంధువులు, స్నేహితులు ఫోన్ చేయ డమో, ఎలా ఉన్నదో తెలిసికునేందుకు రావడమో చేస్తారు. ఈబిడ్డ ఇన్ని సుఖాలమధ్య జన్మించగా....

మరోబిడ్డ- మండుటెండలో....ఎవరూ తన తల్లికి ఆసరాలేని సమ యాన, కష్టించి పనిచేసే ఒక బీదరాలి కడుపున పుడుతుంది. పుట్టిన ఆ బిడ్డకు గాని, ఆ తల్లికి గాని ఎవరూ సహాయముండరు. ఆ మండు టెండలో....ఆ బిడ్డను గంపలో పెట్టుకొని, ఆ తల్లి తిన్నగా తన గుడిసె చేరుకుంటుంది. ఒక బిడ్డ సర్వాంగ సుందరమైన ఎయిర్ కండిషన్ రూమ్‌లో సుఖముగా జన్మించుట; మరోబిడ్డ ఏ సహాయము, ఏ ఆసరా లేకుండా- కష్టాలలో జన్మించుట ఏమిటిది? కేవలము ఆ శిశువులిద్దరూ చేసికొన్న పూర్వజన్మ సుకృత-దుష్కృతాలే కారణము! అంతేకాని...ఇది ప్రకృతి లీల అని భావించి విడిచిపెట్టడము సమంజసము కాదు! కర్మ ఫలితాలననుసరించి....వారిరువురు అలా అలా జన్మించారు. కాని.... సామాన్యులు ఇది స్వభావసిద్ధమని, ప్రకృతి ధర్మమని, లేదా 'నేచర్' అని సంతోషిస్తారు. శుభాశుభ కర్మ ఫలితముగా జీవి జన్మించడము,

[illegible] ప్రతిజీవి సుఖము-దుఃఖము అనుభవించడం.... అనాదినుండి త్రైలకాలికత్తు అవిచ్ఛిన్నముగా సాగుతోంది. కర్మకుతాను స్వయముగా ఫలితమిచ్చే స్వాతంత్ర్యము లేదు! కారణము....కర్మ జడపదార్థము కావడమే! ప్రపంచములో సేవ, నౌకరి, వ్యాపారము మొదలైన కర్మలు స్వయముగా స్వతంత్రించి ఫలితాల నివ్వవు. ఆ యా రంగాలలో నియమితులైన అధికారుల ద్వారా కర్మఫలాలను అనుభవింపజేస్తుంటాయి. అంతేగాని.... నౌకరీ చేసేవానికి- నౌకరీ స్వయముగా జీతము ఇవ్వదు! ఎవరు ఎవరికి నౌకరీ చేస్తారో.... ఆ యజమాని ఆ నౌకరు నౌకరీకి తగిన ఫలితముగా జీతము ఇస్తుంటాడు. ఆ కారణముచే కర్మఫలాలను ఇచ్చేవాడు.... కర్మఫలదాత ఒకడున్నాడని అంగీకరించవలసి ఉన్నది! లౌకిక కర్మలను పూర్తిగా అవగాహన చేసికొన్నవాడే ఆ యా కర్మలకు తగిన ఫలితము ఇస్తుంటాడు. అందుకు ఉదాహరణగా మనకు సమాజములో ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయుడు, కాలేజ్ ప్రిన్సిపాల్, ఫ్యాక్టరీ మేనేజర్ గోచరిస్తారు. వారు తమ అధికారముతో ఎవరెవరు ఎంతపని చేస్తున్నారో పూర్తిగా అవగాహన చేసికొని; దానికి తగ్గ ఫలమును నియమానుసారముగా ఇస్తుంటారు. అనగా....లౌకిక కర్మలకు ఆ యా అధికారులచే ఫలము మారుతూ ఉంటుంది. అంతేగాని.... కర్మ తాను స్వయముగా కర్మఫలమును మాత్రము ఇవ్వదు! అస్తు!

అనంతకోటి బ్రహ్మాండ స్వరూపమైన ఈ ప్రపంచములో.... అనంతకోటి జీవరాసి ఉన్నది! బ్రహ్మాండము యొక్క అనేకత్వాన్ని, అనంతత్వాన్ని ఇప్పుడు ప్రసిద్ధ విజ్ఞాన శాస్త్రవేత్తలు కూడా అంగీకరిస్తున్నారు. భూమండలాన్నుండి అంతరిక్షములో పయనించి; చంద్ర, శుక్ర, [illegible] గ్రహాలను చేరుకోవాలనే ఆకాంక్ష జనించిన విజ్ఞాన శాస్త్రవేత్తలు.... ఎన్నో విశ్వాంతరాళాలు ఉన్నాయని ఏక కంఠముతో పలుకుతున్నారు. అందుకే బ్రహ్మాండాలు అనంతమని విజ్ఞ మహాశయులందరూ ఏకగ్రీవముగా అంగీకరించారు. అనంతానంత బ్రహ్మాండాలలో.... ఒక్కొక్క

బ్రహ్మాండములో అనంతానంత జీవరాసి ఉన్నది. ఆ జ్ఞానము అంతు పట్ట డానికి ప్రపంచములో ఉన్న విజ్ఞాన శాస్త్రవేత్తలందరూ సమావేశమైనా సాధ్యముకాదు. మానవ జనభాను అంచనా వేయవచ్చు! పశువులను లెక్క కట్టవచ్చు! పక్షుల సంఖ్యను తెలుపవచ్చు. కాని ..క్రిమి-కీటకాది రూపములో ఎంత జీవరాశి ఉన్నదో ఎవరు చెప్పగలరు? విశ్వవిజ్ఞాన సదస్సు ఏర్పాటు చేసి; ప్రపంచములో ఉన్న విజ్ఞాన శాస్త్రవేత్తలు చెప్పగలరా? కనీసము అంచనా వేయగలరా? వర్షాకాలపు రాత్రి సమయాన ఒక నగరములో, ఒక పేటలో, ఒక వీథిలోని ఒక విద్యుత్ బల్బ క్రింద.... వేలకొలది జీవ రాసి పుట్టి; తెల్లారేసరికి చనిపోతుంది. ఆ జీవరాశి ఎంతో? వాటి ఆహార వ్యవహారాలేమిటో? ఏజీవి ఏ జాతికి సంబంధించినదో? అవి అనుభవించే సుఖ-దుఃఖాలేమిటో? ఈనాటి మహామేధావుల మనుకుంటున్న విజ్ఞాన శాస్త్రవేత్తలు చెప్పగలరా? అసంభవమని అనుటలో అతిశయోక్తి ఉండ దేమో!? కాని.... ఈ కార్యకలాపమంతా నియమిత వ్యవస్థితమై ఒక నియామకునిచే, వ్యవస్థాపకునిచే సాగుతోంది. అంతేగాని....ఏ మానవ మాత్రునిచేత కాదు! ఇంత జీవరాసి సృజించబడి, నియమిత జీవితము గడిపి, నియమిత సమయానికి మృత్యువాత బడుతోంది. కరాళ కాలగళ మందు సన్నివిష్టమౌతోంది.

భగవంతుడొకడు ఉన్నాడని అంగీకరిస్తే.... మన ప్రశ్నలకు పరం పరకు సమాధానాలు, సమస్యలకు పరిష్కారమార్గాలు గోచరమౌతాయి. అనంతానంత బ్రహ్మాండాలలో ఒక్కొక్క బ్రహ్మాండమందు అనంతా నంత జీవరాసి ఉన్నది. అనంతానంత జీవులలో ఒక్కొక్క జీవి అనంతా నంత జన్మలెత్తుతున్నది. ఒక్కొక్క జీవికి ఒక్కొక్క జన్మలో అనంతానంత కర్మ ఉన్నది. అనంతానంత కర్మలలో ఒక్కొక్క కర్మకు అనంత ఫలితమున్నది అంతేకాదు....అనేక కర్మలకు ఫలముకూడా ఉన్నది. ఆ కర్మ ఫలితమే జన్మసంస్కారముగా జీవిని వెన్నంటివస్తుంది. ఎన్నివిధాల తర్క-వితర్కాలు సాగించినా పూర్వజన్మ-పరజన్మ ఉన్నదని

అంగీకరించవలసి ఉన్నది. కాని....ఈ పూర్వ-పరజన్మలు అంగీకరించని వారికి ఒక్క ప్రశ్న!

మానవ బాలకుడు పుట్టి.... ఆరునెలలు ఎంతో ప్రయత్నము చేసి గాని....కూర్చుండ నేర్చుకోలేక పోతున్నాడు. కాని ఆవు, గేదె, గాడిద, గుఱ్ఱము మొదలైన జంతువుల పిల్లలు పుట్టిన కొన్ని క్షణాలలోనే నడవడమే కాదు.... గంతులేస్తున్నాయి! పరుగెడుతున్నాయి!! పూర్వజన్మను అంగీకరించనివారు- ఈ ప్రశ్నకు సమాధానము చెప్పండి! జంతువుల పిల్లలకు ఎవరు శిక్షణ ఇచ్చారు? వాటికి శిక్షణాలయాలుగానీ, పాఠశాలలుగాని లేవే! పక్షిపిల్లలకు ఎగరడం ఎవరు నేర్పారు? క్షీర నీర వివేకము హంసకు ఎవరు ఉపదేశించారు? మంచి పదార్థాలను విడిచిపెట్టి, నికృష్ట పదార్థములను తినమని కాకిపిల్లలకు ఎవరు నేర్పారు? అప్పుడే పుట్టిన సింహపు పిల్లను లేడిపిల్లపై కుఱకమని ఎవరు చెప్పారు? అందుకు ప్రాణికోటి ఇది ప్రకృతని, స్వభావసిద్ధముని, నేచర్ అని భావించి సంతోషిస్తుంది. కాని.... అది కేవలము సంతోషముగానే మిగిలిపోతుంది సమస్యా పరిష్కారము కావడము లేదు. ఒక జీవి అనేక జన్మలెత్తడము వలన, ఆ యా జన్మలలో చేసిన కర్మఫలము వలన- మరల జన్మించి ఆయా కర్మలాచరింప గలుగుతోంది. ఆవు, గేదె, గాడిద, గుఱ్ఱము ఇవి కేవలము వర్తమానమందే ఆ యా రూపాలతో జన్మించి వుండలేదు. అనేక సార్లు అటువంటి జన్మలెత్తి, ఆ యా జన్మలలో ఆ యా లక్షణాలు కలిగి ఉంటున్నాయి. ఆ యా గుణాలు కలిగి ఉంటున్నాయి. జన్మిస్తూనే పరుగెత్తగలుగుతున్నాయి. వాటికి గత జన్మలో ఆ అభ్యాసమున్నది. ఆ అభ్యాసము కారణముగా వర్తమాన జన్మలో కూడా ఏ శిక్షణా లేకుండా, ఎవరూ నేర్పకుండా....వాటంతటవే నేర్చుకోగలుగుతున్నాయి. ఇది నిత్యసత్యము! నాస్తికులు, చార్వాకమతస్థులు కాదని వాదిస్తే ...వారితో వాదనకు, ప్రతివాదనకు...ఈ చిన్ని పుస్తకములో సమాధానానికి చోటు లేదు!

ముఖ్యముగా చెప్పాలంటే....పూర్వజన్మ సంస్కారము మనస్సులో

కేంద్రీకృతమై ఉంటుంది! దేశ, కాల, పరిస్థితుల ననుసరించి ఆ సంస్కా-
రము ప్రేరేపింపబడుతుంది పూర్వజన్మ అభ్యాసము వలన ఆ జీవి
చేత ప్రేరేపింపబడి ఆ పని చేయిస్తుంది. ఆ కారణము చేతనే పక్షిపిల్ల
ఎవరి శిక్షణా లేకుండా పైకెగర గలుగుతోంది. హంస నీర క్షీర
వివేకము తెలుసుకోగలుగుతుంది. సింహపుపిల్ల లేడిపిల్లపై పడగలుగు
తోంది. కాని ఒక్క ప్రశ్న. ఒక జీవి మనసులో ఇన్ని సంస్కారములు
ఎలా కలుగుతున్నాయి? ఎక్కడనుండి వస్తున్నాయి? కాని....దానికి ఒకే
ఒక్క సమాధానము! నేతిని, నూనెను, ఊరగాయను లేదా మిగిలిన ఏ
ఇతర పదార్థములనైనను ఉంచి కొన్నాళ్ళ తరువాత వాటిని తీసి సోడాతో
గాని, మట్టితోగాని, వేడినీళ్ళతోగాని శుభ్రము చేశామనుకోండి. కాని....ఆ
పాత్రయందలి మెరుపు అనే సంస్కారాన్ని పోగొట్టగలమా? కడిగిన
వెంటనే మెరుగు కనపడకపోవచ్చు. కడిగిన ఆ పాత్రను ఎండలో పెట్టినా
అగ్ని సన్నిధిని పుంచినా దాని మెరుగు పెరుగుతోందేగాని తరగడము
లేదు. ఇక్కడ ఈ మెరుగు అనే సంస్కారము ఆ పాత్రయందు దాగి
ఉన్నదన్నమాట. నిప్పువలన, వేడివలన ఆ మెరుగు మరింత పెరిగింది.
సరిగా అదే విధంగా అనేకమార్లు జంతు, పక్షి, క్రిమి కీటక, దేవ, దానవ,
మానవ, కూకర, సూకర యోనులందు జన్మించడమువలన అన్నిటి
కర్మల సంస్కారము ప్రతిప్రాణి మనస్సునందు దాగి ఉంటుంది. ఆ కార
ణముచే పశువుగా, పక్షిగా జన్మించినపుడు నిహితమైయున్న సంస్కారము
ప్రేరేపింపబడి ఆ ప్రాణికి లేవడము, కూర్చోవడము, పరుగెత్తడము
పారిపోవడము, ఎగరడము, చంపడము, కోయడము మొదలైన వాటి
యందు సంలగ్నం చేస్తుంది. అ కారణముచే ఒక్కొక్క జీవికి అనంతా
నంత జన్మలున్నాయని అంగీకరిస్తే....ఈ ప్రశ్నలకు సమాధానము దొరు
కుతుంది. అనంతానంత జీవకోటి ఉందని, అనంతానంత జన్మలున్నా
యని, అనంతానంత కర్మలున్నాయని ఏ సంకోచమూ లేకుండా అంగీ
కరించవలసి వస్తుంది. మన మొక జన్మలో జన్మ ప్రకృతి మరణ

పర్యంతము ఏ ఏ కర్మలాచరిస్తున్నామో! ప్రతి నిమిషము దినచర్య వ్రాసిగాని తెలుసుకోలేము. కంటిరెప్పలు ఎన్నిసార్లు వేశామో లెక్కించలేము. దారిన నడుస్తూ ఎంతమందిని చూశామో చెప్పలేము. కార్యాలయములో కుర్చీమీద కూర్చుని ఎన్నిసార్లు కాళ్ళు ఆడించామో లేచి కూర్చున్నామో చెప్పలేమే! ఒక పని సంకల్పించి...ఆ పనిని గురించి మనస్సులో అనేక విధాల శుభా-శుభ ఫలితాలను చర్చించుకొంటూ మనోరాజ్యంలో విహరిస్తూంటాము. ఇవన్నీ డైరీలో వ్రాయగలమా!? అసంభవము! ఇటువంటివి ఎన్నో పనులు చెప్పగలము. కాని....వాటిని లెక్కించడం కూడా అసంభవమే! వీటిలో ఏ ఒక్కపని నిష్ఫలము కాదు. వెంటనే దాని ఫలితము కనపడకపోయినా.... భవిష్యత్తులో ప్రతి పనికి ఫలితముందితీరుతుంది. ఏదో ఒక విశిష్ట ఫలమాశించి, ప్రయత్నించి; ఎంత కష్టపడినా దానికి ఫలితము లభించకపోవచ్చు! అప్పుడు....ఆ పనిని ఆచరించిన కర్త తన స్వానుభవముతో-నా కష్టానికి తగిన ఫలము లభించ లేదు. అంతా వ్యర్థమైపోయింది. అని చింతిస్తాడు. వాస్తవానికి అతడు చింతించనవసరము లేదు! ఎంతో ఫలము ఆశించి ఒక పని ప్రారంభించాడు. దాన్ని గురించి ఎంతో కష్టపడ్డాడు. కాని ఫలితము పొందలేక పోయాడు. అంటే ఎంతో ఫలితము ఆశించి ఎంతో వంచితుడయ్యాడు. కర్మ చేయడము వరకే కర్తయొక్క ముఖ్యోద్దేశము. ఫలితమనేది ఎంతోకొంత లభించక మానదు. ఏ ప్రయోజనము లేకుండా మూర్ఖుడు కూడా ఏ పనీ చేయడని బుద్ధిమంతుల, పెద్దల సిద్ధాంతము.

"ప్రయోజన మనుద్దిశ్య
నమందోపి ప్రవర్తతే"

మరో విషయము, ఒక్కొక్క కర్మకు అనేక ఫలితాలు సిద్ధిస్తుంటాయి. ఒక్కొక్క కర్మకు ఒక్క ఫలితమే సిద్ధిస్తుంది. అనే విషయము స్వానుభవము వలన తెలుసుకోవాలి. అందుకు కారణము లేకపోలేదు. ఈ విషయమై అనేకమంది వారి వారి అనుభవాలను బట్టి.... అనేక సిద్ధాం

తాలు తెలియచేశారు. ఆ సిద్ధాంతాలను తెలిసికొని....ఒక్కసారి సింహావలోకనము చేసి చూద్దాము. అనంతానంత బ్రహ్మాండాలున్నాయని, ఒక్కొక్క బ్రహ్మాండములో అనంతానంత జీవరాశి ఉందని, ఒక్కొక్క జీవి అనంతానంత జన్మలెత్తుతుందని, ఒక్కొక్క జీవి అనంతానంత కర్మలాచరిస్తోందని, ఒక్కొక్క కర్మకు అనేక ఫలితాలనుభవిస్తోందని అంగీకరించవలసి వస్తోంది. ఇంత కార్యకలాపము ఏ మానవమాత్రునికీ సాధ్యము కాదు. ఇంత సామర్థ్యము ఒక్క భగవంతునికే ఉంది! అందు చేతనే....ఆ భగవంతుణ్ణి సర్వజ్ఞుడని, సర్వశక్తిమంతుడని పిలువవలసి వస్తోంది.

అక్కడకది సింహావలోకనము జరిగిన తరువాత ఇక్కడ మరో విషయము పరిశీలించవలసి ఉంది. ఏమది? ప్రస్తుత ప్రపంచ మందలి సమస్యలను ఎదుర్కోవడము. మానవమాత్రుడైన ప్రతివారు ఈ ప్రయత్నములో సంలగ్నము కావడము. ఇప్పుడిది ప్రధానముగా సాగవలసిన ప్రయత్నము! సామూహికంగా సాగవలసిన కార్యాచరణ!! ఇప్పుడు మనమందరమూ ఆ ప్రయత్నములోనే ఉన్నాము. ఒకబిడ్డ మండుటెండలో, మరోబిడ్డ ఎయిర్ కండిషన్ రూమ్‌లో ఎందుకు జన్మించాలి? అందరికీ సుఖము ఎందుకు లభించకూడదు? కొందరెందుకు అంత కష్టపడాలి? ఇదంతా ఈశ్వరీయమైన, కర్మఫలస్వరూపమైన సమస్యకాదు. కేవలము మానవకృతమైన సమస్యను రూపుమాపడానికే మనమందరము ప్రయత్నము సాగిస్తున్నాము. అందుకు ప్రతి ఒక్కరి సహాయము కావాలి! ఆ సహాయము అందిననాడు సర్వసమస్యలు పరిష్కరింపబడి మానవప్రాణి సుఖిస్తుంది. సంతోషిస్తుంది. సమస్యలు, బాధలు, చీకులు, చింతలు లేనినాడు...మానవులు సుఖంగా జీవితము గడపగలుగుతారు. సుఖము ఉన్ననాడు సమానత్వము, స్వతంత్రత, సోదరభావము కలుగుతాయి అని భావించి....కమ్యూనిస్ట్, సోషలిస్ట్ వాదులు ఈ సమస్యలను పరిష్కరించి; సమసమాజాన్ని సృష్టించగలిగితే ధన్యులమే! ఎన్ని

సంవత్సరాలు కలసి కృషి చేసినా.... ఇది సాధ్యం కాని పని.! ఈ సమస్యలు పరిష్కరింపబడవేమోననే తోస్తోంది, కమ్యూనిజానికీ, సోష లిజానికీ మూలకందమైన రష్యా, చెకోస్లావియా దేశాలలో కూడా ఈ సమానత్వము లేదే! సమస్యలను పరిష్కరించలేక పోయారే! కమ్యూనిస్ట్ దేశాలలో ఉండే రాష్ట్రపతులు, ప్రధానమంత్రులు, ఉన్నతాధికారులు పొందే సుఖాలు, ఆర్జించే జీతాలు, ఉండే భవనాలు, పొందే సన్మానాలు నాల్గవశ్రేణి సేవకులు పొందుతున్నారా? లేదే! వేలకొలది సంవత్సరాలు కృషిచేసినా సమసమాజాన్ని తీసుకొని రాలేరు. అందరికి అన్ని సుఖాలు కల్పించలేరు. ప్రపంచములో కాదు ఒక్క దేశములో, దేశములో కాదు. ఒక్క నగరములో, నగరములోకాదు, చిన్నపల్లెలో, పల్లెలో కాదు.ఒక్క కుటుంబములో సమానత తేగలరా? అసంభవమంటే అతిశయోక్తికాదేమో! సర్వవిధ సమానత్వము అంత సులభ సాధ్యముకాదు. వందలకొలది, వేల కొలది, కోట్లకొలది సంవత్సరాలు కలసి కృషి సాగించినా.... ఎవరికి నష్టము కలిగించి, ఎవరికి సుఖము కలిగించగలుగుతారు? ఎటువంటి సమానతను తేగలరు? ఉన్నతాధికారులను క్రిందకు దింపుతారా! క్రింది వారిని ఉన్నతాధికారులను చేయగలరా! ఇదీ లేదు. రెండూ అసాధ్యమైన పనులే! అందరి తల్లులను పొలములో మండు ఎండలో ప్రసవింపజేస్తారా! లేక ఎయిర్ కండిషన్ రూమ్‌లో ప్రసవించే ఏర్పాటు చేస్తారా! వెంటనే సోషలిజం వాదులు ఎయిర్ కండిషన్ రూమ్‌లో అని సమాధానమిస్తారు. ఆ సమాధానము వెంట మరొక ప్రశ్న వస్తుంది. ఏమా ప్రశ్న? ఎయిర్ కండిషన్ రూమ్‌లో పుట్టినబిడ్డ చనిపోతుంది! లేదు.... చనిపోయే పుడు తుంది. అటువంటి పరిస్థితిలో అందరినీ చనిపోయేలా చేస్తారా? లేక చంపి పుట్టిస్తారా? అంతేకాదు....పుట్టినవారు మూగగా, మరికొందరు కుంటిగా-గ్రుడ్డిగా-ఇంకొందరు కుష్ఠురోగులుగా, టి.బి. పేషెంట్లుగా పుడుతున్నారు. అంతేకాదు.... కొంతమంది మంచి ఆరోగ్యవంతులుగా జన్మిస్తున్నారు! కొందరికి వరుసగా ఆడపిల్లలు పుడుతున్నారు. మరికొందరికి అందరూ

మగపిల్లలే జన్మిస్తున్నారు వీటిని దూరము చేయగలరా? ఈ సమస్యలు పరిష్కరించగలరా? అందరినీ ఆరోగ్యవంతులుగా పుట్టించే ఏర్పాటు చేస్తారా లేక అందరిని రోగులుగా పుట్టించే ఏర్పాటు చేస్తారా? అదీసాధ్యం కాదు! ఇదీ సాధ్యం కాదు!! అందరినీ స్త్రీలుగానా? లేక పురుషులుగానా? ఎందులో సమానత్వం చూపగలరు? ఏదీ సాధించలేనిపనే! ఇందులో సంకోచించవలసింది ఏమీలేదు. వేదికలపై ఉపన్యాసాలు వేరు. సమాజములో ఆచరించి చూపేది వేరు. మన మేధావులు తమ శక్తిసామర్థ్యాలు ఉపయోగించి అందరినీ స్త్రీలనే సృష్టించినా....లేదా అందరినీ పురుషులనే సృష్టించినా....గొప్ప విశేషమే. అలా అయిన నాడు ఈ ప్రపంచము నడవడము చాలా కష్టము. ప్రపంచములో స్త్రీ-పురుషులే గాదుగా ఉన్నది. కూకర, శూకర, కిక్కర, క్రిమి, కీటకాదులు, దేవ, దానవ, మానవ, పశు, పక్ష్యాదులు ఎన్నో విషమ సమస్యలతో ఉత్పన్నమౌతాయి. ఈ సమస్యలు లక్షల, కోట్ల, అర్బుద సంవత్సరాలు ప్రయత్నము చేసికూడా.... మన కమ్యూనిస్ట్ సోదరులు, సోషలిస్ట్ సోదరులు రూపుమాపలేరు! నెపోలియన్ బోనాపార్టేకు అసంభవమనేది శబ్దము లేదట! అతడి అనుయాయులైన నాస్తికులకు, భౌతికవాదులకు, పూర్వ-పరజన్మలపై విశ్వాసము లేని వారికి ఈ అసంభవ శబ్దము ఎంతో రుచించవచ్చు! కాని ఎంతటి వారికైనా ఈ విషయములో అసంభవమని, ఈ సమస్యలు పరిష్కరింపబడవని అంగీకరించవలసి వస్తుంది. భగవంతుణ్ణి, కర్మను, పునర్జన్మను, కర్మ ఫలమును, వాటిని ప్రసాదించే వానిని నమ్మవలసి ఉంది. శ్రద్ధ విశ్వాసం, నిష్ఠా చూపవలసి ఉంది. సృష్టి ప్రారంభమునుండి నేటివరకు ఈ సమస్యలు పరిష్కరింపబడలేదు! బడలేవు!! ముందు పరిష్కరింపబడవు!!! ఇటువంటి పరిస్థితిలో....ప్రతిప్రాణి తన పూర్వజన్మ కర్మల ననుసరించి ఈ జన్మలో ఆ యా కర్మల భిన్న-భిన్న ఫలాలను అనుభవించడానికి విభిన్న యోనులందు జన్మిస్తూ.... జన్మ ప్రభృతి మరణ పర్యంతము ప్రారబ్ధ కర్మ ఫలాలను అనుభవిస్తుంది. అనుభవించి తీరవలసి వస్తుంది.

ఇదంతా భగవంతుణ్ణి నమ్మినవానికేగాని....మిగిలినవారికి అంతగా అర్థము గాదు. ఎంతగానూ అర్థముకాదు. అందుచే, ఏ దృష్టితో చూసినా భగవంతుడొకడున్నాడని నమ్మాలి! నమ్మవలసిన అవసరమున్నది.

భగవంతుడు లేడు! భగవంతుడు లేడనే వారుకూడా ఆ భగవంతుని స్వరూపభూత గుణాలను తమలో ఊహించుకుంటారు ప్రతి మనిషి జీవించి ఉండాలనే కోరుకుంటాడుగాని....మరణించాలని మాత్రము కోరుకోడే! జ్ఞానము సంపాదించాలనే కాని....అజ్ఞానము కావాలని కోరుకోడే! సుఖమేగాని-దుఃఖము కోరడే! స్వాతంత్ర్యము కోరతాడేగాని....పారతంత్ర్యము కోరడే! అధికారము చెలాయిద్దామనే అనుకుంటాడుగాని.... ఒకరి అధికారములో ఉండడానికి ఒప్పుకోడే! వీటిని పరిశీలించి చూస్తే, సింహావలోకన గావిస్తే; జ్ఞానము, సుఖము, స్వాతంత్ర్యము, నిరంకుశత్వము, శాసనాధికారము: ఈ ఐదు ప్రపంచములో ఏ ప్రాణియందూ లేవు. కాని జీవులందరూ ఈ ఐదింటిని కోరుతారు. ఇది స్వభావసిద్ధమైన కోరిక, స్వాభావికమైన నియమం. ప్రపంచముతో ఉన్న వస్తువును పొందడమనేది ప్రతిప్రాణికి కలిగే కోరికయే! లేని వస్తువుకోసము ఎవరూ ప్రాకులాడరు. ప్రపంచములో లేని వస్తువు అనగా దుప్పికొమ్ములతో తమ గదులు అలంకరించుకోవాలని ప్రయత్నము చేసేవారు కోకొల్లలు. కారణము ... దుప్పికి కొమ్ములున్నాయి కాబట్టి! అంతేగాని.... కుందేలు, గాడిద, గుఱ్ఱము మొదలైన కొమ్ములులేని జంతువుల కొమ్ములు ఇంట అలంకరించుకోవాలని ఎవరూ అనుకోరే! అందుకు కారణము వేరే చెప్పనవసరములేదు. లేని వస్తువుకోసము మానవుడు ప్రయత్నము చేయడు. ఉన్నది తను సంపాదించే వరకూ తహతహలాడి పోతాడు. ప్రపంచములో ఉన్న వస్తువును సంపాదించాలని విశ్వప్రయత్నాలూ చేస్తాము. అది ఎక్కడుంది? ఎలావస్తుంది? సాధ్యమా? అసాధ్యమా? అని ఆలోచించము! శాశ్వతముగా జీవించాలని, జ్ఞానాన్ని సంపాదించాలని, దుఃఖపడకుండ సుఖముగా జీవించాలని, స్వాతంత్ర్యము, అధికారము, ఇవి కావాలని ప్రతిప్రాణి కోరుకుంటుంది, అంటే....ఇవి ప్రపంచములో

ఎక్కడో ఉన్నాయనేగా! జీపిలో మాత్రము ఇవి లేవు. అది త్రికాల బాధ్య మానమైన సత్యము. ఇవి భగవంతునిలో ఉన్నాయి. అతడికి చావులేదు. అజ్ఞానము లేదు. దుఃఖమన్నది లేదు. హానిసత్వము అసలులేదు. శాసనా ధికారమంతా అతడిదే! ఆ కారణముచే ఇక్కడ ప్రతి మానవుడు భగవం తుణ్ణి నమ్ముతున్నాడు. భగవంతుణ్ణి నమ్ముతూనే మానవుడు నాస్తికుడుగా తయారౌతున్నాడు! ఆ నాస్తికుడే ఈశ్వరుడనని చెప్పుకు తిరుగుతున్నాడు! ఇది చాలా ఆశ్చర్యకరమైన విషయము. స్పష్టముగా చెప్పాలంటే తిన్నగా ముక్కు పట్టుకోక, చెయ్యి వెనక్కు త్రిప్పి ద్రవిడ ప్రాణాయామము చేయడము లాంటిది నాస్తికుల అభిప్రాయము. అంటే.... పైకి ఎంత దేవుడు లేదని ప్రగల్భాలు పలికినా- అంతఃకరణలో ఎక్కడో దైవము ఉన్నాడని అంగీకరించి తీరుతాడు! అస్తు.

ప్రపంచములో ప్రతి వస్తువు ఎవరిచేతో ఒకరిచేత నిర్మింపబడు తుంది. అంతేగాని స్వయముగా నిర్మింపబడుటలేదు. కుండలు కుమ్మరి తయారు చేస్తే, బట్టను సాలెవాడు నేస్తాడు. ఇంటిని మేస్త్రీ తయారుచేస్తే, మరొక వస్తువును మరొకడు తయారుచేస్తున్నాడు. చిన్న వస్తువు దగ్గర నుండి పెద్దవస్తువుదాకా ఎవరోఒకరు తయారు చేస్తూనే ఉన్నారు. అలాగే ఈ సర్వ సృష్టిని ఎవరో సృష్టిస్తున్నారు. ప్రపంచములో ఉన్న వస్తువులు ఎవరూ చేయకుండా ఎలా తయారగుట లేదో! అలాగే మనకు గోచరము గాని అపూర్వశక్తి సంపన్నుడు ఈ చరాచర సృష్టిని తయారు చేస్తు న్నాడు. కుమ్మరి, సాలి, మేస్త్రీ మనకు కనిపిస్తున్నారు. కనుక వాళ్ళను నమ్మగలుగుతున్నాము. నిర్గుణుడు, నిరాకారుడు, నిరంజనుడు, జ్యోతి స్వరూపుడు అగు భగవంతుణ్ణి విశ్వసించలేక పోతున్నాము.

పర్వతములను, సముద్రములను, నదులను, అరణ్యమందలి చెట్లను ఎవరూ నిర్మించలేదని, వాటిని ఎవరూ తయారు చేయలేదని నాస్తి కులవాదము, ఆ వాదనతోనే వారు ఈశ్వరుడనే వాడు లేడంటున్నారు. అలా అన్నందువల్ల వారికి ఏ హానీ లేదని వాదిస్తున్నారు. పర్వతము

లను, నదులను, సముద్రములను చెట్లను ఎవరూ తయారు చేయలేదని అంటూనే....తయారు చేసినవాని కోసము అన్వేషిస్తున్నారు. ప్రపంచములో ఉన్న వస్తువులను ఏవరో ఒకరు సృష్టిస్తున్నప్పుడు ఆ తయారు చేసే వారిని ఎవరో ఒకరు తయారు చేయాలికదా? అసలిది ప్రశ్నకాదు! కాని....వివాదానికి ఒక విషయమున్నది. చరాచర జగత్తును సృష్టించినవాడు ఒకడున్నాడా? లేడా? అనే మీమాంస ఉన్నది. ప్రశ్న, ప్రశ్నకు సమాధానము. సమాధానానికి ఉదాహరణలు ఉండాలిగా! అటువంటి పరిస్థితిలో మీమాంసా విషయానికి అదే ఉదాహరణ కారాదు. ఉదాహరణలు ఇచ్చేపక్షములో- అనగా వివాద విషయానికి భిన్నముగా ఉండాలి. పర్వతము, సముద్రము, నది. అడవి ఇవన్నీ ఆలోచించని విషయాలే! వెంటనే వీటిని ఎవరూ మీరు తయారు చేయలేదని అంటారు. ఐనప్పుడు ఇవికాక వేరు ఉదాహరణలేవైనా ఇవ్వగలరా? ఇవ్వలేరే! ఇవ్వడానికి ఉదాహరణలు లేవే! కాని .. నేను వీటిని భగవంతుడనేవాడు సృష్టించాడనీ, దివ్యశక్తి ఒకటి ప్రపంచాన్ని నడిపిస్తున్నదని అంటాను. కుండను కుమ్మరీ, బట్టను సాలెనాడు, ఇంటిని మేస్త్రీ తయారు చేసినట్లే....పర్వత, సముద్ర, నదీ-నద, అరణ్యరూపమైన ఈ ప్రపంచాన్ని భగవానుడు తప్ప తదన్యులెవరూ నిర్మించియుండలేదు! నిర్మించలేరుకూడా!! భగవంతుణ్ణి, భగవన్నిర్మితమైన ఈ ప్రపంచాన్ని, ప్రపంచమందలి వస్తుజాలాన్ని నమ్ముతారు. కాని.... నాస్తికవాదులు ఈ దృశ్యమాన ప్రపంచము భగవన్నిర్మితము కాదన్ని వాదిస్తారు. వీటిని ఎవరూ సృజించలేదనే వారి వాదన! అస్తు.

మరొకసారి పరిశీలించి చూద్దాము. ప్రపంచమందలి ఏ వస్తువు తయారైనా దానికి నిర్మాత అనేవాడు ఒకడుంటాడు! ఆ యా రాష్ట్రాలకు సర్వసుఖాలు కలిగించే నదులూ, పర్వతాలూ, భూభాగము ఆయా రాష్ట్రాల స్వాధీనములో ఉంటాయి. సముద్రమందలి విభిన్న భాగములు విభిన్న రాష్ట్రముల ఆధిపత్యములో ఉన్నాయి. సూయజ్ కాలువపైగల అధికార

ముతో అప్పుడప్పుడు అనేక యుద్ధాలు సాగాయి. ఇప్పుడు అరబ్-ఇజ్రా యిల్ దేశాలమధ్య సాగే యుద్ధాలకు కారణము సూయజ్ కాలువే. ఆకాశ ముపై కూడా అధికారము చెలాయించడానికి అనేక రాష్ట్రాలు విమాన సరిహద్దులు ఏర్పాటుచేసి; ఆధిపత్యము మాదని వాదిస్తున్నాయి. అటువంటి పరిస్థితిలో ఈ సామూహిక ప్రపంచముపై అధికారము చెలాయించేవారు ఎవరూ లేరంటారా! ఎవరో ఒకరు ఉండి తీరాలి. ఆ ఉన్నవాడే ఈశ్వ రుడు! మరో విషయము. చిన్న చిన్న యంత్రాల దగ్గరనుండి, పెద్ద పెద్ద యంత్రాలవఱకు వాటిని నడపడానికి ఒక నియామకుడు ఉంటాడు. ఆ నియామకుడు లేకపోతే ఆ యంత్రము నడవడము కాని, పనిచేయడము గాని జరగదు. ఏ వ్యవస్థా ఉండదు. అంతేకాదు కర్మాగారాలకు, ఫ్యాక్ట రీలకు, మిల్లులకు, కార్యాలయాలకు, స్కూల్సుకు కాలేజీలకు ఆయారాష్ట్రా లలో వాటి వాటి కార్యాచరణలకు యోగ్యులైన ఇంజనీర్లను, ప్రధానా ధ్యాపకులను నియమించడము జరుగుతుంది. ఆ నియామకమే లేకపోతే.. ఏపని జరుగదు. విభిన్న రంగాలలో విభిన్న వ్యక్తులను నియమించి; ఆ యా పనులు సాగే ఏర్పాటు జరుగుతోంది. ఆ యా పనులకు ఆ యా అధికారులు నియమింపబడి; నియమానుసారము ఆ యా పనులు నెర వేరుస్తున్నారు. వారు నియమింపబడకుంటే ఆ యా రంగాలలోని పనులు జరుగవే! అటువంటి పరిస్థితిలో- ఈ ప్రపంచాన్ని నడిపే నియామకుడు, సంచాలకుడు, వ్యవస్థాపకుడు ఒకడున్నాడని, ఆతడి శక్తివల్లే ఈ ప్రపం చము నడుస్తుందని విశ్వసించవలసి వస్తుంది. సర్వశక్తి సంపన్నుడైన ఈశ్వరునిచే నియమింపబడిన సూర్యుడు, చంద్రుడు, గ్రహములు, నక్షత్రములు నియమిత సమయాలకు, నియమిత రూపములో ఉదయించి; అస్తమిస్తున్నాయి. అవి వాటి క్రమము తప్పుట లేదు. భూమి, నీరు, నిప్పు, వాయువు, ఆకాశము; వీటన్నిటికి ఎవరో ఒక నియామకుడు ఉన్నాడు. సంచాలకుడు ఉన్నాడు. వ్యవస్థాపకుడు ఉన్నాడు. ఏ

వ్యవస్థా లేదని మీరనవచ్చు! అవి వాటి పనులు నియమిత సమయములో జాగరూకతతో చేస్తున్నాయేగాని.... ఏ నియామకుడూ, సంచాలకుడు లేడని వాదించవచ్చు!! కాని ఒక్క విషయము జాగ్రత్తగా ఆలోచించ వలసి ఉన్నది. సర్వశక్తి సంపన్నుడైన భగవానునిచే ఆ యా నియంతలు నియమింపబడి, ఆ పరబ్రహ్మ అనబడే పరమాత్మకు భయపడి; తమ అధికారాలను, కర్తవ్యములను సక్రమముగా కొనసాగిస్తున్నాయి. వాటిపై పరబ్రహ్మ తన అధికారమును, ఆధిపత్యమును కొనసాగిస్తున్నాడు! ఉత్పత్తి చేస్తున్నాడు, పెంచుతున్నాడు, లయము చేస్తున్నాడు. ఈ పనులు చేసే ఒక కర్త ఉన్నాడని, అతడు అఖండ సచ్చిదానంద ఘన స్వరూపుడని, అతడే పరమాత్మయని విశ్వసించాలి! ఒక్క విషయముపై ప్రజలకు- ఈ మానవకోటికి సందేహము కలుగుతోంది. సంశయము జనిస్తోంది. సృష్టించేవాడు పెంచుతున్నాడు. అంతవరకూ బాగానే ఉన్నది కాని.... పెంచేవాడే ఎలా సంహరించ గలుగుతున్నాడు. ఇది ఎలా నమ్మాలి? ఎలా విశ్వసించాలి? పెద్ద ఆశ్చర్యము లేదే! మనము నిత్యము చూస్తున్నాము. ఏమని? రైతు వరి మొక్కను నాటుతున్నాడు, పెంచు తున్నాడు. పంట చేతికందే సమయానికి కోసేస్తున్నాడు. తన చేతులతో నాటిన మొక్కను తానుగా పెంచి తన చేతులతో త్రుంచుతున్నాడే! అయిన నాడు....భగవానుడు జగత్తును సృజించి, పెంచి, లయము చేయు టలో ఆశ్చర్యము లేదే! సందేహము లేదే! దాన్ని విశ్వసించడానికి ఎవరూ వెనుకాడవలసిన పనిలేదు. అస్తు.

భారతీయ చరిత్రలో యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధి మొదలైన వాటిద్వారా మనస్సును ఏకాగ్రపఱచి, ఋతంభరా ప్రజ్ఞను పొంది, పూతాత్మలై నిర్మలాత్మలైన ఋషులు, మహర్షులు, సాధువులు, సత్పురుషులు, యోగిజనులు ఆ పరా త్పరుణ్ణి సందర్శించలేనినాడు సామాన్య మానవులము మనము సంద ర్శించగలమా? అసాధ్యము! అసంభవము!!జరగనిపని!! మహారాణి మీరా,

భక్తలైదాసు, మాలవాడైన చేతా, మంగలి వాడైన నంద, ధనవంతుడైన జాట్‌ల చరిత్రలు విశ్వవిదితమే కదా! తుకారామ్, రామదాసు, రామదేవ, నామదేవ మొదలైనవారు ఉచ్చకోటికి సంబంధించిన మహాత్ములు, భక్తులు. వారిలో కూడా....మీరాలాంటి భక్తురాలికే భగవత్సాక్షాత్కారము అయినది. ఆమె ఏ యోగము, ఏ యజ్ఞము, ఏ జపము, తపము చేయలేదు! కేవలము నామస్మరణే చేసినది!! భగవానుడు స్వయముగా దర్శనమిచ్చి ఎందరి మహాత్ముల చేతి భోజనమో ఆరగించాడు. జ్ఞానులు భగవంతుణ్ణి దర్శించగలిగారు. ఐతే నాడు భగవంతుడు లేడని ఎలా అనగలము? కాని....నాస్తికవాదులు కళ్ళకు కనపడని భగవంతుణ్ణి నమ్మటం ఎలా అంటారు. కాని... ప్రపంచములో కొన్ని కళ్ళకు కనపడవే! శబ్దము కళ్ళతో చూడలేము. కాని శబ్దముందని అంగీకరిస్తున్నాము. వెంటనే మానవకోటి చెవులతో వింటున్నాము కదా! అని సమాధానమిస్తుంది. ఆ కారణముచేత- శబ్దము కనపడకపోయినా వినిపిస్తుంది కదా! అని వినిపించే శబ్దము ఉన్నదని అంగీకరిస్తామంటారు. కాని....కళ్ళకు కనబడని, చెవులకు వినపడని మంచుయొక్క శీతలతనుకూడా అంగీకరిస్తున్నాము. అందుకు కారణము....శరీరము దాని లక్షణాన్ని తెలుపుతుంది కనుక! ఇక్కడ ఒక్క విషయము పరిశీలించవలసి వున్నది. శరీరము ప్రతి రసాన్ని అనుభవించగలదు. ఏ రసాన్నైనా అనుభవించలేకపోవచ్చు!అంత మాత్రముచేత ఆ రసము లేదని ఎలా అనగలము? రసానుభవము కళ్ళు, చెవులు, చర్మము ద్వారా సాగకపోయినా రసాంకురముల ద్వారా సాగగలదు కాన, దానిని అంగీకరిస్తున్నాము, గంధముయొక్క ఆస్తికత కళ్ళద్వారా, చెవులద్వారా, చర్మముద్వారా, రసాంకురముల ద్వారా అందదు. వెంటనే మానవుడు ముక్కుద్వారా గంధాన్ని ఆస్వాదించి; అది ఉన్నదని అంగీకరిస్తున్నాడు. కాబట్టి....గంధమనేది ఉన్నదని ఒప్పుకుంటాము. అంతేగాని...కళ్ళకు, ముక్కు, చెవులకు, చర్మానికి,నాలుకకు

అందని, ఆనని ఆ భగవంతుణ్ణి ఎలా విశ్వసించడము? ఎలా నమ్మడము? పంచేంద్రియాలకు అందని ఆ భగవంతుడెవరు? అతడికి ఆస్తికత ఎక్కడ ఉన్నది? అనే వాదము నాస్తికులలో ప్రబలి ఉన్నది. కాని వారందరికీ ఒక్క విషయము. శరీరములో ఒక అంగములో ఎక్కడో దెబ్బ తగులుతుంది. దాని అనుభవము దుఃఖరూపములో ఉంటుంది. దుఃఖాన్ని మనము అంగీకరిస్తున్నాము. కాని ఆ దుఃఖము మనకు కన బడుటలేదు. వినబడుట లేదు. ముక్కుద్వారా తెలుసుకోలేము. చర్మము ద్వారా అంతుపట్టలేము. బాధపడుతున్నామని మాత్రము చెప్పగలము. అంతేగాని ప్రత్యక్ష జ్ఞానము లేదు. బాధని అంగీకరిస్తున్నాము. కాని భగవంతుణ్ణి మాత్రము ఒప్పుకోవడములేదు. దాన్ని ఏమనాలో తెలియ డము లేదు. మరో ప్రశ్న. పంచేంద్రియాల ద్వారా దుఃఖాన్ని తెలుసుకో లేకపోయినా.... మనస్సు ద్వారా దాన్ని అనుభవిస్తున్నాము. కాబట్టి దుఃఖము ఉన్నదని వాదిస్తున్నారు. బల్లగ్రుద్ది చెప్పగలుగుతున్నారు. భగ వంతుడు అన్నవాడు మనస్సుకుకూడా దొరకడే! అయినప్పుడు భగ వంతుడు ఎక్కడున్నాడు? లేడు! అన్నవారికి మరో ప్రశ్న. పైన పేర్కొన్న దుఃఖము నిరంతరము శరీరములో ఉండుటలేదు. ఏదో విశేష సంఘటన జరిగినప్పుడు, లేదా శారీరక, మానసిక బాధ జనించి నప్పుడు అంతేగాని....ఎల్లవేళల ఆ దుఃఖమనేది ఉండుటలేదు. అవును. దుఃఖము ఆ యా సమయాలలోనే కలుగుతుంది. అలాగే భగవంతుణ్ణి గురించి చెప్పాలంటే....స్పష్టముగా వివరించాలంటే.... సద్గురువుయొక్క తీవ్రమైన వాగ్బాణాలద్వారా గాని, వేదశాస్త్రములవల్లగాని, మనస్సులో శ్రద్ధాభక్తులు జన్మించినప్పుడుగాని, అసాధారణమైన సుఖ-దుఃఖాలు అనుభవిస్తున్నప్పుడుగాని ఒక్కసారి భగవంతుడు జ్ఞప్తికి వస్తాడు అతడు పంచేంద్రియాలకు అతీతుడుగానే గోచరిస్తాడు మనస్సుకు కూడా అందడు. అందుచేత ఆతడి సాక్షాత్కారము ఇంద్రియాలకు, మనస్సుకు కూడా కాదు! ఆ పరమాత్మ సాక్షాత్కారము కష్టసాధ్యము.

పంచేంద్రియాలను అదుపులో పెట్టి, మనస్సును కేంద్రీకరణచేసి; వైరాగ్య భావముతో సదాచార సంపత్తితో కఠిన సాధన చేయాలి. ఇంద్రియ లోలునకు భగవత్సాక్షాత్కారము అవదు! వారు భగవంతుణ్ణి గూర్చి తెలుసుకోలేరు!! అస్తు.

ప్రపంచమందలి విషయాలు తెలుసుకోడానికి పది సంవత్సరముల వరకూ మెట్రిక్ లేదా ఎస్. ఎస్. ఎల్. సి పరీక్షలు వ్రాస్తున్నాడు. ఆ తరువాత- ఆరు సంవత్సరములలో ఎమ్ ఎ. చదువ గలుగుతున్నాడు. ఈ లౌకిక జ్ఞానము కోసము మానవుడు పదహారేళ్ళు గడుపుతున్నాడు. గడపవలసి వస్తున్నది. అయినా....ఎందులోనూ సంపూర్ణ జ్ఞానము సంపాదించలేకపోతున్నాడు. ఏదో ఒక విషయంపై తమ సబ్జక్టుపై తెలుసుకో గలుగుతున్నాడు. **M.A,** ఆర్ట్సుగాని, సైన్స్ విషయములోగాని అతడికి సంబంధించిన గ్రూప్‌లో కేవలము 'మాస్టరీ' సంపాదించగలుగుతున్నాడే గాని....విశేషజ్ఞతనుగాని, సంపూర్ణ జ్ఞానాన్నిగాని సంపాదించలేక పోతున్నాడు. ఎక్స్‌పర్ట్ కాలేక పోతున్నాడు అందుకు మరల రెండు సంవ సంవత్సరములు **Ph D.** కోర్స్ చదువుతున్నాడు. కష్టపడి **D. litt. D. Phil** కాగలుగుతున్నాడు. ప్రపంచ విషయాలలో ఒక శాఖయందలి జ్ఞానాన్ని సంపాదించడానికి పాతిక సంవత్సరాలు గడిపే మానవుడు.... అందులోకూడ పూర్తి మర్మాన్ని తెలిసికోలేని మానవుడు- రెండు మూడు అనుమానాల సమాధానముతో ఈశ్వర అస్తిత్వాన్ని తెలుసుకోగలనని అనుకోవడము మౌఢ్యమే అవుతుంది. అటువంటి వారిని ఏమనాలో తెలియడము లేదు. ఇరవై సంవత్సరాలు ఎంతో శ్రమపడి కృషిచేసి, లౌకిక విషయాలలోని ఒక భాగములో ఏ కొద్దో నేర్చుకొని; అంతా తెలిసిపోయిందని భావిస్తున్నాము అంతములేని విద్య అంతు చూసినవాడులేడు. కనీసము అయిదు సంవత్సరాలు భగవంతుణ్ణి గురించి తెలుసుకోడానికి ప్రయత్నము చేస్తే, భగవంతుడొకడున్నాడన్న, అతడికి సంబంధించిన విషయమున్నదని తెలుస్తుంది.

నా అనుభవములో బ్రహ్మ, పరమాత్మ, అఖండ సచ్చిదానంద, అనాథనాథ, దీనబంధు, జగన్నాథ, దయాసింధు, అయిన భగవానుని విషయమై పొందిన అనుభవము- మనస్సుద్వారాగాని, వాణిద్వారా గాని వ్యక్తము చేయలేను.

ప్రతిప్రాణి శరీరములో స్థూల శరీరము, ఎముకలు, మాంసము, రక్తము ఉండేవే. పంచేంద్రియములు, రెండు చేతులు, రెండు కాళ్ళు, వాక్కు, మలమూత్ర విసర్జన సాధనములు ఉండేవే. చెవులు, కళ్ళు, నాలుక, ముక్కు, చర్మము; స్పర్శ, రూప, రస, గంధాదుల విషయ జ్ఞానానికి ఉండేవే. ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము ప్రతిప్రాణిలో ఉండేవే. ప్రాణము నాసిక ద్వారా వస్తూ....పోతూ హృద్గతమై ఉంటుంది. అపానవాయువు అందరికి అనుభవమైన వాయువే! ఉదానవాయువు కంఠమువద్ద ఉంటుంది. వ్యానవాయువు శరీరమంతా వ్యాపించి; మనము తిన్న ఆహారాన్ని, త్రాగిన నీటిని విసర్జావయవాల ద్వారా బయటకు పంపుతుంది. సమానవాయువుద్వారా మనము భుజించిన ఆహార పదార్థాల రసము సమానముగా శరీరమంతా చేరుతుంది. ఇవి కాక....శరీరములో బుద్ధి, మనస్సు అనే రెండు తత్వాలున్నాయి. ఆ రెంటిని గురించి అందరికి తెలిసిందే. రిజిస్ట్రార్, జడ్జిల మధ్యగల భేదమే మనస్సుకు-బుద్ధికి ఉన్నది. ఇంద్రియాలద్వారా ప్రాప్తమైన విషయాలను మనోరూపమైన రిజిస్ట్రార్ బుద్ధిరూపమైన జడ్జిగారి వద్దకు నిర్ణయముకోసను పంపుతాడు. జడ్జిద్వారా జరిగిన నిర్ణయము జడ్జి, రిజిస్ట్రార్, సాక్షులు, వాదులు, ప్రతివాదులు అనుభవించినట్లే.... ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, ప్రాణములేగాక; జీవాత్మకూడా అనుభవిస్తుంది. విషయము స్వయముగా తాను దేన్నీ భోగించదు! ఇంద్రియములు మనస్సుకు అప్పగించి అవి ఊరకుంటాయి మనస్సు బుద్ధికి పంపుతుంది. బుద్ధికూడా భోగించదు. వీటన్నిటికంటె భిన్నమైన భోక్త ఒకటి ఉన్నది. అదే జీవాత్మ! శరీరాన్ని చేతనంగా ఒప్పుకోకూడదు. కారణము....

మరణించిన తరువాత శరీరము ఉంటుందిగాని, అందులో చేతనత్వ ముండదు. శరీరమే చైతన్యమును కలిగి ఉంటే మృతదేహములో కూడా చేతనత్వ ముండాలి.

అదే విధముగా- పంచేంద్రియాలలో కూడా చేతనత్వము లేదు! ఉదాహరణకు, చేతులలో చేతనత్వముందని ఒప్పుకొంటే.... చేతుల ద్వారా చేయబడ్డ పనులు స్మరణ కొస్తాయి. అప్పుడు అవే ఆత్మగా పరిగణింపబడాలి. ఆ పరిస్థితిలో కాళ్ళు, నాలుక తదితర అవయ వాలున్నట్లు తెలియదు. కారణము....అప్పుడవి ఆత్మచైతన్యము కలిగి యుండటము లేదుగనుక; అదే కాళ్ళకు చైతన్యము ఉన్నదని వాదించిన నాడు మిగిలిన కర్మేంద్రియాలను విస్మరించడము జరుగుతోంది. ఆ కార ణముచే పంచేంద్రియాలలో కూడా చైతన్యము లేదు! జ్ఞానేంద్రియాలలో కూడా చేతనత్వము లేదు! అయిన నాడు- ఒక్కొక్క ఇంద్రియానికి స్వతంత్ర చైతన్యముందని భావిస్తే; నిరంతరము శరీరమందలి ఇంద్రియా లన్నీ పరస్పర విరోధంతో సంగ్రామము సాగిస్తూనే ఉంటాయి.అటువంటి పరిస్థితిలో శరీరము ఏపనీ చేయలేక నశించి పోతుంది. ఈ దోషాన్ని రూపుమాపుటకు అన్నిటిలో సమ్మిళిత రూపములో చైతన్యముందని భావిస్తే; శరీరములో ఏ అంగము పోయినా; శరీరములోని చైతన్యము సమాప్తమై మరణిస్తుందని ఒప్పుకు తీరాలి. ఎందుచేత? సమ్మిళితమైన ఆత్మలో ఒక అంగము నష్టమైంది గనుక, అందుచేత- శరీరము, మనస్సు, బుద్ధి, ఇంద్రియాలలో వేరువేరుగా గాని, సమ్మిళిత రూపములో గాని చైతన్యము లేదని అనాలి. అదే పరిస్థితి ప్రాణాలలో కూడా గోచరమౌతుంది. ఇవన్నీ సాధనములు. గృహము, ప్రక్క, కారు మొదలైనవాటిని ఉపయోగించే మానవుడు వాటన్నిటికీ భిన్నుడే! కావున సాధన భూతమైన శరీరము, మనస్సు, బుద్ధి, ప్రాణము, ఇంద్రియాలకు వేరుగా....ఒక జీవాత్మయొక్క శక్తి సామర్థ్యాలవలన ఈ పనులు జరుగుతున్నాయి. ఆ జీవాత్మే లేనివాడు ఏ పనులూ జరగవు! అస్తు.

బహుశా- ప్రతిప్రాణికి ఆత్మపై ప్రేమ ఉంటుంది. పరమ ప్రేమతోకూడిన విషయమే ఆత్మ. సామాన్య మానవులకు డబ్బుపైన, పుత్ర, మిత్ర, కళత్రాదులపైన ప్రేమ-ఉంటుంది. కాని.... ఆత్మకు అపద సంభవించినపుడు డబ్బును, పుత్ర, మిత్ర, కళత్రాదులను విడిచి వెళ్ళవలసి వస్తోంది. వారిని విడిచిపోవలసి వస్తుంది. నిజము చెప్పా లంటే....డబ్బుమీద, మిగిలినవారిమీద వాస్తవికమైన ప్రేమ మానవుడికి ఉండుటలేదు. శరీరానికి హాని సమకూరే సందర్భాలలో కర్మేంద్రియా లను రక్షింమకునేందుకు ప్రయత్నము చేస్తున్నాము. మూగవారము కావాలని కోరుకోము. కుంటివాళ్ళమవాలని కోరి తెచ్చుకోము. స్థూల శరీరము కన్నా మనకు కర్మేంద్రియాలపై ప్రేమ ఎక్కువగా ఉంటుంది. కర్మేంద్రియాలకన్న జ్ఞానేంద్రియాలపై మమకారమెక్కువగా ఉంటుంది. మనస్సుకు బాధకలిగే సందర్భాలలో మానవుడు గ్రుడ్డివాడు అవడానికి, చెవిటివాడవడానికి, మూగవాడవడానికిప్రయత్నము చేస్తాడుగాని ... పిచ్చి వాడై- బుద్ధి పోగొట్టుకొనేందుకు ప్రయత్నము చేయడు! ఆ కారణముచే మానవుడికి బుద్ధిపై ప్రేమ ఎక్కువగా ఉంటుంది. అని ...బుద్ధి పోగొట్టు కొనుటకైనా అంగీకరిస్తాడు గాని; ప్రాణాన్ని చేజేతుల తీసికోలేడు- ప్రాణాలపై మానవుడికి అంత ప్రీతి! ఈ ఉదాహరణతో.... ప్రాణాలపై సర్వాధిక ప్రేమానుభవము ఉన్న కారణముచే... ప్రాణాన్ని ఆత్మ అన్నారు. కాని....ప్రాణముకూడా పైన చెప్పబడిన తర్కానుసారము ఒక సాధనమే! రెండవ విధముగా ఆత్మను "నేను" అని వ్యవహరిస్తాము.ప్రతి మానవుడికి నేను, నాది అనే అనుభవము కలుగుతోంది. కాని....అవన్నీ ఆత్మకు భిన్నమైనవి. ఆత్మ వాటికి భిన్నమైందిగా అనాదినుండి వస్తోంది! ఇది నా ఇల్లు. ఇతడు నా సోదరుడు. ఈమె నా భార్య. ఇది నా కారు. ఇదంతా నా ఫర్నీచర్. ఇది నా రేడియో అనే భావము అనుభవ విషయమేగాని ఆత్మకాదు! ఈ విషయము ఆబాల-గోపాలము, విశేషించి బుద్ధిమంతులు, జనసామాన్యం అంగీకరించే విషయమే! అందుచేత శరీరం

అత్మకు భిన్నమైనది. అలాగే 'నా కారు.' ఇది కూడా ఆత్మకు భిన్నమే!
అస్తు!

ఆదే విధముగా- ఇంద్రియాలలో కూడా "ఇవి నా చేతులు, నా
కాళ్ళు, నా వాక్కు" అనే అనుభవము కలుగుతోంది. అంతేగాని....అవి
కూడా ఆత్మకు భిన్నమైనవే! జ్ఞానేంద్రియాలలో కూడా "నా కళ్ళు, నా
చెవులు, నా ముక్కు, నా నాలుక" అనే అనుభవము కలుగుతోంది. అవి
కూడా ఆత్మకు భిన్నమైనవే! మనస్సుకూడా ఆత్మకు భిన్నమైనదే!!
బుద్ధి, ప్రాణముల పరిస్థితికూడా అదే!! అంతేకాదు ... ప్రాణాల విషయ
ములోకూడ ఇతే వర్తిస్తుంది. "నేను ఇంతకాలము ప్రాణాయామము చేయ
గలిగాను. ప్రాణవాయువును ఆపి ఉంచాను"అని అంటుంటారు. పరిశీలించి
చూడగా....ఆత్మ- ప్రాణాలకు కూడా భిన్నమైనది. జాగ్రదావస్థలో ఈ
భేదము గోచరించకపోవచ్చుగాని.... స్వప్నావస్థలో స్థూల శరీరముతో
ఆత్మకు భేదమున్నదని స్పష్టమౌతోంది. స్వప్నావస్థలో శరీరము ఒక
మంచముపైనపడి ఉంటుంది. కాని ...నిద్రించే వ్యక్తి ఫ్రంటియర్ మేల్ లో,
కార్ లో లేదా ఏరోప్లైన్ లో బొంబాయినుండి కలకత్తాకు షికారుకు వెళ్ళి
తిరిగి వస్తుంటాడు. కండ్లుమూసికొని నిద్రపోయినా....అక్కడి దృశ్యాలు
కనపడుతుంటాయి. చెవులు మూసికొన్నా వినబడతాయి. ఆదేవిధముగా
తినడము, తిరగడము మొదలైన వ్యవహారాలన్నీ జరుగుతాయి. నిజముగా
స్థూలశరీరానికి అవేమీ వర్తించవు. నిద్రించే శరీరము మంచముపైన పడే
ఉంటుంది. స్వప్నానంతరము నిద్రలో ఏవిధమైన స్వప్నము ఉండదు!
ఏరకమైన కోరిక ఉండదు!! కేవలము ప్రాణి సుఖముగా నిద్రపోతుంది.
ఇక ఏ వస్తువును గుర్తించదు! నిద్రనుండిలేచిన తరువాత సుఖముగా నిద్ర
పోయానని అంటుంది. ఏమి జరిగినదో తెలియదనంటుంది. కేవలము స్మృతి
మాత్రము మిగిలిపోతుంది. అది కేవలము సుషుప్త్యవస్థలో కలిగినసుఖమూ,
అజ్ఞానమే! ఎందుచేతననగా .. ఏ అనుభవము లేకుండా స్మృతి ఉండదు!
ఆ కారణముచే- నిద్రావస్థలో మనస్సు, బుద్ధి, ప్రాణము, ఇంద్రియములు,

స్థూల శరీరము ఇవేమీ లేవు. ఇది అందరికీ తెలిసినదే! అవన్నీ లేక పోయినాకూడా- ఏదో అనుభవము జరుగుతోంది. ఆ కారణముచే- వీట న్నిటికీ భిన్నముగా ఆత్మయొక్క ఆధిపత్యమును అంగీకరించవలసి వస్తుంది.

చైతన్యమును పంచమహాభూతముల పరిణామముగా అంగీకరించిన నాడు- ఒక సందేహము కలుగుతోంది. వీటన్నిటిలోను వేఱువేఱు చైత న్యము లేదు! ఆ కారణముచే సముదాయముగా చైతన్యములేదు!! సున్న ములో గాని, చెక్కలోగాని, ఆకులోగాని, కవిరిలోగాని విడివిడిగా ఉన్న ప్పుడు ఎఱ్ఱరంగు లేదు!!! వాటి మిశ్రమముతో ఆ రంగు ఏర్పడుతోంది. అదేవిధముగా....బెల్లము, పిండి తదితర వస్తువుల సంయోగముతో మాద కత ఏర్పడుతోందేగాని....విడివిడిగా ఆ మత్తు విశేషము గోచరించుట లేదు. అదే మాదిరి- భూమి మొదలైన పంచభూతముల సంయోగముతో- శరీరములో స్వతఃచైతన్యము కలుగుతోంది. ఆ కారణముచే- శరీరానికి భిన్నముగా ఏ చైతన్యాన్ని అంగీకరించవలసిన విషయము లేదు.

గులాబి అంకురములో నాళము, స్కంధము, శాఖా, ప్రశాఖా, పత్రము, పుష్పము, ముండ్లు, సుమధుర గంధము ఉత్పన్నమయ్యే శక్తి ఉన్నట్లు; తల్లి దండ్రుల రజో వీర్యములో కూడా స్థూల శరీరము, జ్ఞానేం ద్రియములు, మనస్సు, బుద్ధి, ప్రాణము, చైతన్యము మొదలైనవి ఉత్పన్న మయ్యే శక్తి ఉన్నది. ఆ కారణముచే- చైతన్యము వేఱని, ఆత్మ వేఱని భావించవలసిన పనిలేదు! కాని .. వీటన్నిటికి స్పష్టమైన ఒకే ఒక సరైన సమాధానమున్నదని అనడము దోషమనే చెప్పాలి తాత్పర్యమేమనగా.... ప్రతీ తల్లిదండ్రుల శరీరములోని- రజోవీర్యమునందూ నవీన చైతన్యము ఉన్నదని అంగీకరిస్తే ... పుట్టే వ్యక్తి జన్మాది మరణ పర్యంతము సుఖ- దుఃఖాలు అనుభవిస్తున్నాడు. ఆ సుఖదుఃఖాలకు కారణమేమిటి? ఎందు చేతననగా.... గులాబీ పువ్వువలె తల్లిదండ్రుల రజోవీర్యము వలన క్రొత్తజీవి ఉత్పన్నమౌతోంది. ముందు అతడు ఏ పనీ చేయలేదు,

మనినాడు- అతడు ఏ కర్మఫలము అనుభవిస్తాడు? దానినే "అకృతాభ్యా
మమ"ని అంటారు. ముందు ఏ కర్మ ఆచరించకుండా జీవి ప్రపంచ
ంలో జన్మించినప్పుడు- ఏ రకమైన ఫలితము అనుభవించవలసి ఉండదు
నా! సుఖ-దుఃఖాలు భోగించవలసి ఉండదు కదా! అదేవిధముగా- ఏ
తన్యమును, ఏ శక్తిని అంగీకరించకుంటే.... ఆత్మ శరీరముతో మర
ంచి; శరీరముతోపాటే కాలి; బూడిద అయిపోవాలి. అయిననాడు
రోజన్మే లేదు! సుఖదుఃఖములు అసలు లేనేలేవు. మంచి చెడు
లే వసలు లేనేలేవు. కర్మలు లేవు. కర్మఫలము అనుభవించేవారు లేరు.
నినే "కృత హానిదోషమ"న్నారు. శరీరము, ఇంద్రియములు, మనస్సు,
బుద్ధి మొదలైన వాటికి భిన్నముగా ఒక స్థిరచైతన్యమైన ఆత్మను
ంనము అంగీకరించకుంటే.... ఈ రెంటి దోషాలనుండి ఎన్నటికి విము
క్తము కాలేము. కర్మఫలితము అంతయూ అనుభవించవలసిదే! పూర్వ
జన్మ, వర్తమానము, పరజన్మ ఉన్నది అని అంగీకరించిననాడు- పైరెండు
దోషాలు అంటవు!! పునర్జన్మను అంగీకరించిననాడు- పూర్వజన్మలో
చేసిన కర్మఫలము ఉత్తరోత్తర జన్మలలో భోగింపవలసి ఉన్నది. చేయని
కర్మకు ఫలితము లేదని వేరే చెప్పనవసరములేదు. ఆ కారణముచే- ఎన్ని
విధాల పరిశీలన చేసి చూచినా....ఆత్మ, జీవియొక్క శక్తి సామర్థ్యాలు,
పునర్జన్మ సిద్ధాంతములను ఒప్పుకోవలసి వస్తుంది.

పునర్జన్మకు ఆధారము కర్మయే! ఆ కర్మను అనుభవించడానికే
మరోజన్మ ఎత్తవలసి ఉంటోంది.

శ్రీ అరవిందఘోష్ చెప్పినది- భారతీయదర్శన, ధర్మశాస్త్ర,
వేదములకు విరుద్ధముగా ఉన్నది. "మానవయోని సిద్ధించిన జీవి- అన్య
జీవుల యోనులలో ప్రవేశించద"ని శ్రీ అరవిందఘోష్ చెప్పియున్నారు.
కాని ...కర్మ ఫలితాన్ని అనుభవించుటకు ఏ యోనిలోనైనా ప్రవేశించవ
వచ్చు! ఈ విషయములో- ఎంత గొప్పవాడు ఏమి చెప్పినా- కర్మ
ఫలము అనుభవించడానికి జీవి ఏ యోనిలోనైనా ప్రవేశించవచ్చునే

సిద్ధాంతము ఉన్నది! ధర్మ, దర్శన శాస్త్రముల సిద్ధాంతము కూడా అదే!! వాటి సిద్ధాంతానుసారము మనము వెళ్ళాలిగాని; మన నిర్ణయాలప్రకారము అవి జరుగవు. మారవు. నేటి మహా వైజ్ఞానికులు మానవుల భవిష్యత్తు తేల్చి చెప్పలేరే! అటువంటిది- పూర్వజన్మను గురించి ఏమి చెప్పగలరు? భారతదేశములో పుట్టి, వేదశాస్త్ర సిద్ధాంతాలను అవహేళనచేసి, తన ఇష్టానుసారము సాధన సాగించి; భజన చేసినంత మాత్రాన సిద్ధి పొంద లేదు. ఏ సిద్ధీ పొందలేనివాడు సిద్ధాంతమును ఎలా చేయగలడు? జడ భర తునివంటి యోగి పుంగవుడు, సిద్ధపురుషుడూకూడా కర్మవశాత్తూ లేడిగా జన్మించాడు. అయిన నాడు.... మానవయోని యందు పుట్టినవాడు. ఏ జీవియోని యందు పుట్టడని సిద్ధాంతము ఏమీ లేదు. శాస్త్రములలో ఇంకా ఎన్నో ఇటువంటి ఉదాహరణలున్నాయి. మనుష్య యోనియేకాదు. ఇంద్రపదవి నలంకరించిన నహుషుడు సర్పమై జన్మించాడు. ఎన్నో దానాలు చేసిన "నృగుడ"ను రాజు తొండై పుట్టాడు. ఈ విషయములో శాస్త్రాలను అతిక్రమించి, మన ఇష్టము వచ్చినట్లు సిద్ధాంతాలను చేయ కూడదు! నిర్ణయాలు చేసికోకూడదు!! ఎంత సాధన చేసినా, ఎంత మహా త్ముడుగా ప్రపంచములో చెలామణీ అవుతున్నా....జన్మల విషయమై ఒక సిద్ధాంతము చేయడానికి అర్హుడు కాడు!!! అర్హత లేదు.

సృష్టి స్వయముగా సాగదు? అది భగవంతుడనే వానిద్వారా సాగు తుంది! దానికి సంబంధించిన విషయాలు వెనుక తర్క రూపములో చెప్పుకొన్నాము.

ఈశ్వరుడే సత్యము!

సత్యమైన ఆ ఈశ్వర ప్రాప్తికై ప్రతి వ్యక్తి సాధన చేయాలి. అదీ....వర్ణాశ్రమ ధర్మాల ననుసరించి సాగాలి. కామమును, నిషిద్ధ కర్మ లను పరిత్యజించి; వర్ణాశ్రమ విహితమైన నిత్య-నైమిత్తిక ప్రాయశ్చిత్త కర్మానుష్ఠానము చేసినందువలన.... చిత్తశుద్ధి కలుగుతుంది. చిత్త శుద్ధి గలిగిన భగవద్భక్తుడు భక్తిద్వారా మనస్సును కేంద్రీకరణ చేయ

గలుగుతాడు! అంతేగాదు.... శమ, దమ, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధాన మొదలైన బాహ్య సాధనాల ద్వారానూ; శ్రవణ, మనన, నిధిధ్యాసనాది అంతరంగసాధనల ద్వారాను; జ్ఞానమువల్లను- కేంద్రీకరణమౌతుంది. శమాది సాధనలకు వివేకము, వైరాగ్యము కావాలి! "ఈశ్వరుడే ఏకమాత్ర సత్యము!! అతనికి భిన్నమైన ప్రపంచమంతా మిధ్యయే"! అని ఒక నిశ్చయాత్మక జ్ఞానము కలిగి యుండడమే వివేకము! ఇహ-పరలోక సంబంధమైన సర్వభోగాలను మనస్సునుండి తొలగించి, వైరాగ్యభావముతో- సర్వకాల సర్వావస్థలయందు ఈశ్వరనామ స్మరణ చేయాలి! ఇంద్రియాలను విషయ వాసనలనుండి మరల్చడమే శమము! మనస్సును నిరోధించడమే దమము! విషయవాసనలకు దూరముగా ఉండి, అభీష్ట తత్వ వస్తువునందు మనస్సును స్థాపన చేయడమే ఉపరతి! సుఖము, దుఃఖము, ఆకలి, దప్పిక, చలి, వేడి వీటినన్నిటినీ సహించడమే తితిక్ష! గురువు, వేదవాక్యములందు విశ్వాసముంచడమే శ్రద్ధ! విషయవాసనలను మనసునుండి తొలగించి, మనస్సును భగవంతునియందు లగ్నము చేయడమే సమాధానము! వేదశాస్త్రములన్నీ భగవంతుని గూర్చియే తెలుపుచున్నవి. వాటిని గురుజనుల ద్వారా ఉపదేశము పొందడమే శ్రవణమని పిలిపించుకొంటుంచి. అసంభావన, విపరీత భావనరూపమైన తర్కములను విడిచిపెట్టి; నిశ్చయాత్మక బుద్ధి కలిగియుండడమే మననము! తైలధారవత్తు అవిచ్ఛిన్నముగా భగవద్భావన కలిగియుండడమే నిధిధ్యాసము! ఇవే సత్య ప్రాప్త సాధనాలు! అస్తు!

తల్లి గర్భాన్నుండి బయటకువచ్చి; శరీరమునఉండి, ప్రాణవియోగ పూర్వస్థితియే జీవము! ఈ జీవము పరమాత్మతో అవిచ్ఛిన్న సంబంధము కలిగి ఉంటుంది. దానిని మనము మఱచిపోతున్నాము.

రాగద్వేషాలు జీవానికి విభిన్న అంగాలు కావు! కారణమేమనగా.... మన చరిత్రలో శుకుడు, జనకుడు మొదలైన సత్పురుషులు- గృహస్థులు! జన్మప్రభృతి రాగ, ద్వేష, వినిర్ముక్తులయ్యారు. అస్తు!

కర్మను మూడు రకాలుగా తెలిపారు. శుభము, అశుభము, శుభాశుభము అని వాటిని వ్యవహరించారు. అశుభ, శుభాశుభకర్మల ఫలముతో-జీవి-జీవితముతో రాగ, ద్వేష సంబంధము కలిగి ఉంటాడు. కేవలము శుభకర్మల ఫలితముగా జన్మించిన జీవి....జన్మ ప్రభృతి మృత్యు పర్యంతము రాగ ద్వేషాలకు అతీతుడుగానే ఉంటాడు. మన చరిత్రలో వీటికెన్నో ఉదాహరణ లున్నాయి. గతించిన కృత, త్రేత, ద్వాపర యుగాలలోనే గాక.... కలియుగములో కూడా- మీరా, తుకారామ్, రామదాసు, జ్ఞానేశ్వరులే గాక.... చేత, జాట్, నందా మొదలైన వారుకూడా రాగద్వేష రహితులుగానే జీవించారు. ఇది నిత్య సత్యమని వేరే చెప్పనక్కరలేదు. సర్వవిదితమైన విషయమని పదేపదే చెప్పనవసరము లేదు. తాత్పర్యమేమనగా పూర్వజన్మలో కామ్యకర్మ ఎన్నడూ చేయక; హింస, దొంగతనము, లూఠీ, మద్యపానము, మాంసభక్షణ మొదలైన నిందిత కార్యాలాచరించి; తన వర్ణ, ఆశ్రమానుసారము శాస్త్రముల ద్వారా నిర్దిష్ట నిత్య, నైమిత్తిక, ప్రాయశ్చిత్త కర్మానుష్ఠానముల సాగించి; తన అంతఃకరణను నిరంతరము నిర్మలముగా ఉంచుకొని; జీవితము సాగించేవానికి పూర్వజన్మయందలి ప్రబలమైన ప్రతిబంధకాలు కారణముగా- ఆ జన్మలో జ్ఞానము, భగవద్భక్తి పొందలేకపోయినా.... మరు జన్మలో పుడుతూనే భగవద్భక్తుడు, జ్ఞాన, వైరాగ్య సంపన్నుడుగా జన్మిస్తాడు. కర్మలశక్తి ననుసరించి రాగద్వేషములు జీవితమును ప్రభావితము చేస్తాయి. రాగద్వేషానికి మూలము ఉగ్రకర్మ, ఉగ్రతరకర్మ, ఉగ్రతమకర్మ, సాధారణకర్మ అని వివరించి చెప్పారు. వాటిననుసరించే రాగద్వేషాలు కూడా- ఉగ్ర, ఉగ్రతర, ఉగ్రతమ, సాధారణముగానే జీవిలో ప్రవర్తిల్లి; జీవితమును ప్రభావితము చేస్తాయి. ఆ కర్మలు పూర్తిగా నాశనము కాకపోతే ... రాగద్వేషాలు నశించవు! అస్తు!

రాగద్వేషాలు నశించాలంటే .. పూర్వోక్త ప్రకారముగా సాత్త్విక కర్మలు అంతతోగత్యా నిర్గుణనిష్కామ కర్మలు చేయవలసి ఉన్నది. వాటి

ద్వారానే రాగద్వేషాలు నశిస్తాయి. అంతేగాని.... నిరంతరము ఏపని-
పాటూలేకుండా సమాజానికి పనికిరాని పనులు చేస్తూ; శాంతిలేకుండా,
ప్రశాంతి కొఱకు పాటుపడక, విప్లవాలే పరమధ్యేయమని భావించి; అల్లి
కల్లోలాలు సృష్టించే ఈనాటి యువతరాన్ని ఏమనాలి? ఏమనవద్దు! వారిని
మార్చడానికే ప్రయత్నము చేయాలి. ఇంకా రెచ్చగొట్టకూడదు. సమాజో
పయోగమైన పనులయందు అతడు ప్రవేశించడానికి తగిన ఏర్పాటు
చేయాలి. అందువలన నీకు, సమాజానికి కూడా సుఖ-సంతోషాలు కలుగు
తాయని నచ్చచెప్పాలి. సమాజానికి సుఖ-సంతోషాలు కలిగినప్పుడు
శాంతి ఉంటుంది. శాంతి చేకూరినప్పుడు భక్తి కలుగుతుంది. భక్తితోనిండిన
హృదయము చెడుచేయలేదు. చెడుచేయనినాడు అంతా మంచే చేకూరు
తుంది! మంచి మానవ జీవితానికి సుఖాలనే చేకూరుస్తుంది! అందుచేత....
ఆవారాగా తిరిగే వ్యక్తిని దగ్గఱ కూర్చోబెట్టుకొని, మంచిమంచి విషయాలు
చెప్పి; సమాజానికి ఉపయోగించే సేవాకార్యాలు చేయించడానికి ప్రయ
త్నము చేయాలి. సమాజానికి సేవ చేసిన వ్యక్తులను, వారి చరిత్రలను
ఆవారాగా తిరిగే వారికి చెప్పాలి. వారి ఆదర్శాలను, సద్గుణాలనుగుఱించి
వివరముగా చెప్పి; ఆ మంచిని ఈ అవారా మనస్సులోకి చొచ్చుకొని
పోయేలా చెప్పాలి. ఆ భావాలు వాడి మనస్సులో కేంద్రీకరణ కావాలి.
అలా అయిననాడు-సమాజానికి చెడు తలపెట్టేవాడు- ఆ కార్యక్రమానికి
స్వస్తిచెప్పి; సమాజానికి శ్రేయస్సు కలిగించే పనులయందే తన మనస్సును
లగ్నము చేస్తాడు. సేవావృత్తి, నిస్వార్థభావన ఆ మనిషిలో కలుగుతాయి.
మార్పు ప్రతి జీవితాన సహజము! నిన్నటిమనిషి నిన్నటిలాగే ఉంటాడను
కోవడంమౌఢ్యమే అవుతుంది. అతడిని మనము మార్చడానికి ప్రయత్నము
చేయాలి. మారినమనిషి సేవాభావముతో సమాజానికి మంచే చేస్తాడు! అది
సిద్ధాంతము. అందుకు ఎంతో చరిత్రఉన్నది. ఎందఱో వ్యక్తులుఉన్నారు.
వారిని గుఱించి-సమాజములో ఆవారాగా తిరిగేవారికి చెప్పి; సర్వ

విధాలా మార్చడానికి ప్రయత్నము సాగాలి. అలా సాగిననాడు- సమాజానికి శ్రేయస్సు తప్పక కలిగి తీరుతుంది. శ్రేయోదాయక సమాజము ఎంతో అభివృద్ధి సాధిస్తుంది. అభివృద్ధి సాధించిన సమాజము శ్రేయోదాయక కార్యకలాపాలు చేపట్టగలదు. సమాజశ్రేయస్సు ద్వారా- దేశశ్రేయస్సు, ద్వారా- ప్రపంచ శ్రేయస్సు వెల్లివిరుస్తుంది! అస్తు.

మరోవిషయము- వర్తమాన ప్రపంచము ఎంత అజ్ఞానములో ఉందంటే ఎవరూ- ఏ విధముగానూ తిరుగుబాటు చేయనవసరముఉండదు. అజ్ఞానానికి అవిద్య తోడౌతోంది. ఆ అవిద్యతో కామాచారుడై, కామ వాదనతో- కామభక్షణయందు ప్రవృత్తుడై, స్వేచ్ఛాచార పరాయణుడై సంచరిస్తాడు మానవుడు! అటువంటి మానవుణ్ణి విద్యావంతుణ్ణిచేసి, అతని అజ్ఞానాన్ని పోగొట్టి, జ్ఞానిగా మార్చి, శాస్త్రాన్ని తెలియజేసి; శాస్త్రవిహిత కర్మనిష్ఠునిగా మార్చాలి. దానికి కొంత సాధన కావాలి. అభ్యాసముండాలి. మరోవిషయము-"కామప్రవృత్తుడు కాకూడదని కాదు....ప్రపంచములో పుట్టిన ప్రతిజీవి- ప్రకృతి ధర్మాన్ననుసరించి విషయ సుఖాలయందు రతుడౌతాడు. అంత మాత్రముచేత అత్యాచారాలు, హత్యలుచేయనవసరములేదు. బలాత్కారాలు, భయపెట్టడాలు జరుగకూడదు. అలా జరిగిననాడు శాంతి, సౌఖ్యము లభించవు. అందుచేత, సాంసారిక విషయ సుఖేచ్ఛ గలిగిననాడు- అనాచార, అత్యాచారములను విడిచిపెట్టి; విధిపూర్వకముగా, న్యాయముగా, ధర్మముగా- సేవ, నౌకరి, చాకిరి, వ్యవసాయము, వ్యాపారము మొదలైన ఉపాయాలతో ధనోపార్జన చేసి; ఆ ధనముతో సాంసారిక సుఖాలు అనుభవించు. అన్యాయముగా, అధర్మముగా మాత్రము సంపాదన చేయకు"! అని ఉపదేశము చేసి; అత్యాచారాలుచేసే మానవుణ్ణి సన్మార్గములోకి దింపాలి! సన్మార్గగామి అకృత్యాలు చేయడు! చేయలేడు!! కామ్యకర్మమార్గగామి అవుతాడు, అనంతరము- మెల్లమెల్లగా నిష్కామ, నిస్స్వార్థ కర్మలయందలి- మహిమను, గొప్పతనమును చూపి; సకామ కర్మలనుండి దూరముచేసి; నిష్కామభావము కలిగించాలి! నిష్కామభావము వలన- రాగద్వేషాలు క్రమ-క్రమముగా జీవినుండి తప్పుకుంటాయి. అస్తు!.

మన బంధు-బాంధవులు, స్నేహితులు ఎవరూ చిరస్థాయిగా ఈ భూమండలముపై ఉండలేదు. ఒకజన్మ ఉన్నంతవఱకూ వారితో సంబంధముంటుంది. ఒక్క పతివ్రతయే.... పరజన్మలో కూడా తన పూర్వ జన్మలో ఉన్న భర్తనే మరల భర్తగా పొందుతుంది తప్ప మిగిలిన వారందఱూ ఆజన్మతో సరి. ఈవిషయములో ఆదిశంకరులు అంటారు- "ఈ జన్మలో తల్లిదండ్రులు, పుత్ర, పౌత్ర, కళత్ర, మిత్రాదులను గూర్చి బాధపడుతున్నావే! మరి....నీవు ఎన్నో జన్మలెత్తావే!! ఆ యా జన్మల లోని వారందఱిగూర్చి ఎందుకు బాధపడుట లేదు? వారందఱూ ఎక్కడున్నారు? మనము ఎక్కడున్నాము? ప్రపంచములో ఈ సంబంధబాంధవ్యాలు ఆ జన్మతోసరి" ఇదే సిద్ధాంతము మన శాస్త్రాలలో- సత్పురుషుల వాణిలో గోచరమౌతుంది. స్పష్టముచేసి- వారందఱూ ఈ విషయములో ఏకాభిప్రాయము వెలిబుచ్చారు. అప్పుడప్పుడు ప్రబల ప్రారబ్ధవశముచే అనేక జన్మలలోకూడా ఈ సంబంధముంటుంది. అని కొందఱనవచ్చు! వారి భావము కేవలము అపవాదుగా ఒప్పుకోవాలి అంతే!

"ఇది మంచి. ఇది చెడు. ఇది పుణ్యము. ఇది పాపము" అనే విషయము తేల్చి చెప్పుట నీ మేధస్సుకు, నా మేధస్సుకు అందే విషయము కాదు! కేవలము శాస్త్రమే చెప్పాలి!! పాప-పుణ్యాలు మనకంటికి కనపడేవి కావు. మిగిలిన ఇంద్రియాలద్వారా కూడా వాటిని గ్రహించలేము. ఒక కన్యద్వారా వివాహానంతరము సంతానాన్ని పొందటము మహాపుణ్యము. కాని....ఆ కన్య ద్వారానే వివాహముకాక పూర్వము సంతానాన్ని పొందకూడదు. పొందిన మహాపాపము! ఈ విషయము కేవలము శాస్త్రము ద్వారానే కాని....అన్యథా తెలిసికోలేము, ప్రమాణాలుకూడాలేవు. అందుచేతనే గీతలో స్వయముగా కృష్ణపరమాత్మ ఇలా అన్నారు.

"తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే
కార్యాకార్య వ్యవస్థితౌ॥"

ఇది మంచి, ఇది చెడు అని గుర్తించడం కేవలము శాస్త్రాలద్వారానే కాని అన్యథా కుదరదు. ఏది చేయవచ్చో- అది మంచిది. ఏది చేయకూడదో-అది చెడు! పైన గీతావాక్యములో గీతాచార్యుడు ఏది చేయవచ్చు? ఏది చేయకూడదు? అనే విషయము కేవలము శాస్త్రమే నిర్ణయించి చెప్పాలనీ, అది శాస్త్రముద్వారానే తేలుతుందని చెప్పాడు. వివాహఫలము ఏమి? కామసుఖము కోసము, సంతానోత్పాదనార్థము. ఈ రెండూ లౌకిక దృష్టికి అందేవి. ఈ రెండింటినీ ఎవరిని వివాహము చేసికొన్నా పొందవచ్చు! అటువంటి పరిస్థితిలో తల్లి, సోదరి, కన్య వీరిని వివాహము చేసికొన్నా సాంసారిక సుఖమూ, సంతానోత్పాదన సిద్ధిస్తాయి! "ఆ విషయ సుఖాలు, సంతానము రెండూకూడా- నలుపుగాగాని, పచ్చగాగాని, నీలవర్ణముగా గాని, తెల్లగాగాని, చిన్నగా-పెద్దగాగాని, పొడవుగా-వెడల్పుగా గాని, తూకానికిగాని- కొలతకుగాని అందనిపాపము సిద్ధిస్తుంది" అంటే ఎవరూ అంగీకరించరు. కాని శాస్త్రము మాత్రము అటువంటి సంబంధము కలిగి ఉండుట మహాపాపమని ఘోషిస్తోంది. వారిద్వారా విషయసుఖాలు పొందుటగాని, సంతానాన్ని బడయుట కాని, అసలు ఆ సంకల్పము ఉండుటగాని మహాపాపమన్నారు. దొంగతనము, లూఠీ, హత్య మొదలైన అకృత్యములు చేయరాదనికదా? కాని....మానవుడు కేవలము స్వార్థముతో సాంసారిక సుఖభోగలాలసుడై కష్టపడకుండా- ధన సముపార్జన చేయాలనే సంకల్పముతో దారుణమైన పనులు చేస్తున్నాడు. దానితో- ఎంతో డబ్బు సంపాదిస్తున్నాడు. మరో విషయము! ఈనాడు ఏ రంగములో పనిచేసినా, ఏ ఉద్యోగము చేసినా....ఆ యా రంగాలలోనివారు, ఆ యా ఉద్యోగస్థులు "మేము అసత్యమాడకుండా ఏపనీ చేయలేకపోతున్నాము" అంటున్నారు. ఆఫీస్‌లలో పనిచేసే ప్రతీ ఆఫీసర్ ఆలస్యముగా వెళ్ళడము, రిజిసర్‌లో మాత్రము సరైన సమయానికే వచ్చానని సంతకము చేసి; ఆ టైమే అక్కడ వేయుట జరుగుతోంది. అందుకు కారణమేమిటి? ఆలా మూడురోజులు లేట్‌గా ఆఫీస్‌కువచ్చి; లేట్ మార్క్ వేసినట్లయితే ఒకరోజు సెలవుగా పరిగణింపబడుతుంది. సెలవులుంటే....ఏ బాధా

లేదనుకోండి! లేకుంటే.... ఆ రోజు జీతము మినహాయించి మిగిలినజీతము
ఇస్తారు. అందుచేత- ఆ జీతము పోకుండా, సామాన్యముగా అందరూ
అబద్ధమాడి, ఆ జీతాన్నికూడా రాబట్టుకుంటున్నారు. హింసవలన, అసత్య
భాషణవలన, దొంగతనమువలన సంప్రాప్తమయ్యే పాపము మనకు పైకి
వ్యక్తముకాదు, గోచరముకాదు. తర్కదృష్ట్యా.... ఈ పనులన్నిటివలన
సంప్రాప్తమయ్యే లాభము ఎందరో పొందుచున్నారు. దొంగ వ్యాపారము,
లంచము, భ్రష్టాచారము, అత్యాచారము, వ్యభిచారము, పాపాచారము
ఇవన్నీ రోజురోజుకు ఎక్కువౌతున్నాయేగాని తగ్గుటలేదు. అందుకు కారణము
ఆ యా పనులవలన సంప్రాప్తమయ్యే పాపము, తాత్కాలికనష్టము
కనపడక పోవడమే! అందుచేత- అవినీతి నిరోధకశాఖవారు కూడా
భ్రష్టాచారులౌతున్నారు. మద్యనిషేధ కర్మచారులు స్వయముగా మద్య
పానులౌతున్నారు. వర్తమాన ప్రపంచములో ఇది పాపమని, ఇది పుణ్య
మని, ఇది మంచని, ఇది చెడని నిర్ణయించి చెప్పేవారు లేకపోయారు.
అందుకు కారణము- పాప-పుణ్యాలకు, మంచి-చెడులకు వారిమేధ
అందకపోవడమే! అదీగాక.... తాత్కాలిక లాభమాశించి, ధన సముపార్జ
నయే ప్రధానముగా భావించి, పాప-పుణ్య వివక్షత లేకుండా సంచరిస్తు
న్నాడు మానవుడు! అదీగాక....శాస్త్రాన్ని నమ్మదము లేదు. శాస్త్రము
చెప్పిన విహిత కర్మలాచరించుట లేదు. "ఈ శాస్త్రాలు కేవలము బ్రాహ్మ
ణులు వారికోసము వ్రాసికొన్నారు వారి పనులకు అడ్డురాకుండా వాటిని
ప్రచారము చేసారు. పాప-పుణ్యాలు, నరకము అంధ విశ్వాసము! ఇవన్నీ
బలహీన మనస్కులను భయపెట్టడానికిగాని....మరెందుకు కాదు. వారు
చెప్పేవన్నీ కేవలము వారికోసమేగాని మరెందుకూకాదు" అని వారివాదము!
వాదముకాదు మనకు ప్రధానము! కాని ఒక్క విషయము- నేడు మేధావు
లుగా చెలామణి అయ్యేవారూ, ఉచ్చకోటికి సంబంధించిన నాయకులు ఈ
నాస్తికతకు అగ్నికి ఆజ్యము పోసినట్లు చేస్తున్నారు. అంతేకాదు....
గ్రంథాలద్వారా, పత్ర-పత్రికల ద్వారా, సినిమాల ద్వారా,

కములద్వారా, వేదికలద్వారా ఈ విషయమై బహుళ ప్రచారము చేస్తు న్నారు. వారి ఈ ప్రచారానికి కారణము ఏమీ అర్థముకాదు. వారి కందని విషయాన్ని గూర్చి వారు ప్రచారము చేయడము అజ్ఞానమే అవుతుంది. అజ్ఞులు ప్రచారము చేయుట భావ్యము కావచ్చుగాని, విజ్ఞులుగా చెలామణి అయ్యేవారు కూడా....ఈ మార్గాన్ని అనుసరించుట శోచనీయమే! ఎవ రెన్ని ప్రచారాలు చేసినా, ఎంత నాస్తికత ప్రబలినా.... ఒక్క విషయము మాత్రము మఱచిపోకూడదు. పవిత్ర భారతదేశములో జన్మించి, వేద శాస్త్రిలను అభ్యసించి, ఎన్నో ఘనకార్యాలు సాధించి; మనకు మోక్ష మార్గము చూపిన పవిత్రమూర్తుల అడుగుజాడలలో సంచరించుట అధర్మము కాదు, అన్యాయముకాదు, అక్రమముకాదు. న్యాయసమ్మతము, ధర్మసమ్మతము! యుక్తి, తర్కమువలన ఎన్నటికీ పాప-పుణ్య, మంచి-చెడులను గుర్తించలేము. గుర్తించుట సాధ్యమైనది కాదు. ఈ పాప-పుణ్యములు మన భవిష్యజీవితమును ప్రభావితము చేస్తాయి. అంతేకాదు.... భావిజీవిత నిర్మాణము జరుగుతున్నది. పెద్దలు ఒక కథ చెబుతారు ఒక ధనవంతుడు ఒకానొక మహాత్ముని భక్తుడు. ప్రతిరోజు ఆ మహాత్ముని దర్శనార్థము వచ్చేవాడు. తిరిగి వెళ్ళేవాడుకూడా! ఆ మహాత్మునికి సర్వసదుపాయాలు చేసేవాడు. ఆ మనకు సేవచేయడముతోనే సరిపో యేది. ఆ మహాత్మునికి ఇంకా ఎందఱో భక్తులున్నారు. వా రందఱూ యథాశక్తి పూజాద్రవ్యములు, తదితర వస్తుసామగ్రి పంపేవారు. ఆ విధముగా మెల్లమెల్లగా ఆ మహాత్ముని దగ్గఱ ఒక లక్షరూపాయలు పోగుపడ్డాయి. ఆ డబ్బును తనకు అత్యంత విశ్వాసపాత్రుడైన ఆ ధనికుని వద్ద దాచమని ఇచ్చాడు. కొంతకాలము గతించినది. ఆ ధనముతో ఆశ్ర మాన్ని నిర్మించాలని మహాత్మునికి ఉద్దేశ్యము కలిగినది. ఆ ఉద్దేశ్యముతో ఆ ధనికుణ్ణి తానిచ్చిన లక్షరూపాయలు తిరిగి ఇమ్మని అడిగాడు. ధన వంతుని మనస్సు మారింది. "స్వామీ! ఏమిటి మీరనేది? డబ్బేమిటి? ఎప్పు డిచ్చారు? లంగోట ధరించిన మీ దగ్గఱ లక్షరూపాయలా? అవి నాకివ్వ డమా?" అని తనకేమీ తెలియనట్లు పలికాడు, ఆ పలుకులు విని ఆ మహా

ష్మడు ఆశ్చర్యపోయాడు. వెంటనే ప్రాణాలు విడిచాడు. ఆ ధనికునికి అంతకుముందు సంతానములేరు. కాలచక్రము తిరుగుతోంది. సరిగా పది నెలలు గతించేసరికి అతడికి ఒక కుమారుడు పుట్టాడు వృద్ధాప్యములో సంతానము కలిగినదని ఆ ధనికుడు ధనమును నీరులా ఖర్చుపెట్టాడు. బిడ్డను గారాబముగా పెంచాడు. ఎంతో ఖర్చుపెడుతున్నాడు. ఆ కుమారుడుకూడా ధనమును నీరులా ఖర్చుపెడుతున్నాడు. యువావస్థరాగానే అతడు నిరంతరము స్నేహితులతోనూ, బంధు-బాంధవులతోను హాయిగా జీవితాన్ని గడుపుతూ....అంతులేని ధనము ఖర్చుచేయసాగాడు. అతడికి అదేపని. తండ్రికూడా ఏమీ అనుటలేదేమో.... స్వేచ్ఛాచారియై సంచరిస్తున్నాడు. తండ్రి బాధపడసాగాడు. తన కుమారుడు ఎంత ఖర్చుపెడుతున్నాడని కూడా లెక్కవేయలేదు. ఒకనాడు కొడుకు ఒక విందు ఏర్పాటు చేసాడు. దానికి ఎంతో ఖర్చు చేసాడు. అందఱితోపాటు తనూ విందారగించాడు. అందఱిని సాగనంపాడు. కాలాతీతమైనదేమో...నిద్రపోయాడు. నిద్రపోబోయే అతడికి 'తాంబూలము వేసికోలేదే....మర్చిపోయానే'? అని అనుకొని నౌకరును పిలిచి వెంటనే తాంబూలము తెప్పించుకొన్నాడు. అదితీసికొని తాంబూలచర్వణము చేసి; నిద్రపోయాడు. అంతే....ఇంక లేవలేదు. ధనికుడు ఏడ్చాడు, మొత్తుకున్నాడు, పడిదొర్లాడు. ఏమీలాభము లేకపోయినది. గుమస్తా వచ్చి "అయ్యా! పుట్టినది మొదలు ఇంతవఱకు మీ కుమారుని ఖర్చుమొత్తము లక్షరూపాయలు". ఈ కథ విన్న తరువాత ఏ భావము కలుగుతుందో వేఱే చెప్పనక్కఱలేదు. అస్తు!

జీవితములో కేవలము భగవత్ప్రాప్తి వలననే శాంతి లభిస్తుంది. భగవత్ప్రాప్తి నిష్కామకర్మల ద్వారా సిద్ధిస్తుంది. చిత్తశుద్ధి, ఉపాసన, ఏకాగ్రత, జ్ఞానము వీటివలన అజ్ఞానము నశిస్తుంది. మనస్సువలన భగవంతుని సాక్షాత్కారము అవుతుంది. మనస్సునందు మలము, విక్షేపము, ఆవరణ అని మూడు దోషములు! మొదటి దోషము మనస్సునందలి మలినము! దానికి కారణము జన్మజన్మాంతర, యుగయుగాంతర, కల్పా-

కల్పాంతరములలో చేసిన కర్మఫలము. కర్మవాసన! మాసినబట్టలను సబ్బుతో, నీటితో శుభ్రపఱచుకొన్నట్లు మనస్సునందలి మలినములను పోగొట్టేందుకు శాస్త్రవిహిత నిష్కామ కర్మలు ఆచరించాలి. రెండవ దోషము విక్షేపము! అనగా చిత్తచాంచల్యము! ఈ చాంచల్యమును భగవద్భక్తిద్వారా అరికట్టవచ్చు! నశింపచేసికోవచ్చు!! భగవంతుని యందు ప్రేమభావము కలిగి ఉండాలి. రూప-గుణ జ్ఞానము కలవానికి ప్రేమ సహజముగా జన్మిస్తుంది. భగవంతునియందు ప్రేమ ఉత్పన్నమవ్వాలంటే....రూపము-గుణము ఎనలేని అవసరము. లౌకిక పదార్థాలయందు కూడా ప్రేమభావము ఉండాలి. అలా ఉన్ననాడే.... భగవంతునియందు కూడా ప్రేమభావము కలుగుతుంది. భగవంతునియందు ప్రేమభావము ఉత్పన్నమవ్వాలంటే....భగవంతుని రూప-గుణాలు కీర్తించాలి! సాధన సాగించాలి!! భగవానుని పవిత్ర చరిత్రను వినాలి!!! చదవాలి!!!! భగవంతునిగూర్చి ఎంత తెలిసికొంటే.... అంత ప్రేమ పెరుగుతుంది. ప్రేమ పెరిగేకొద్దీ మనస్సు భగవానునియందు లగ్నమౌతుంది. పుత్ర, మిత్ర, కళత్రాదులపై ప్రేమభావము ఉండుటవలన కూడా మనస్సు లగ్నమౌతుంది. ఎవనియందు ప్రేమభావము ఎక్కువగా ఉంటుందో....వాని రూప-గుణజ్ఞానము మనస్సునందుండిపోతుంది. ఈ కారణముగా....రామాయణ, మహాభారత గ్రంథాలు; పురాణాలు చదువుచూ, వినుచూ.... ఆ భగవానుని రూప-గుణ కీర్తనలను సాగిస్తూ.... భగవద్విషయాలను తెలిసికోవాలి! అది లేనినాడు భగవద్భక్తి లేదు. భగవద్భక్తిలేనినాడు, భక్తి కుదరనినాడు చిత్తచాంచల్యము పోదు. ఈ సాధనలద్వారా చిత్తఏకాగ్రత కలుగుతుంది. ఏకాగ్రత కలిగిననాడు శాంతభావము, శాంతభావముతో లౌకిక విషయాలపై విరక్తి కలుగుతాయి. విరక్తిభావము కలుగుటవలన సుఖము-దుఃఖము, ఆకలి-దప్పిక, వేడి-చలి సహించగల శక్తి సంప్రాప్తమౌతుంది. అంతేకాదు....గురువులు, శాస్త్రములు తెలిపిన విషయములపై శ్రద్ధ-విశ్వాసము కలుగుతుంది. కలిగిననాడు- మోక్షేచ్ఛ

కలుగుతుంది. అనంతరము శ్రవణ, మనన, నిధిధ్యాసన ద్వారా భగవత్ సాక్షాత్కారమై శాశ్వత శాంతి సిద్ధిస్తుంది.

ఇదే జీవియొక్క పరమోద్దేశ్యము!

గర్భములో ప్రవేశించినతోడనే....అతడి అయుపు, కర్మ, విద్య, సంపత్తి, మృత్యువు, ఈ అయిదు నిర్ణయింపబడతాయి. మనము వర్త మాన ప్రపంచములో చూడగలుగుతున్న విషయమొకటి ఉన్నది. ఏమది? ఒక వ్యక్తి జీవితాంతమువరకూ శ్రమపడినా.... వెయ్యిరూపాయలు కూడ బెట్టలేకపోతున్నాడు. మరో వ్యక్తి ఏ శ్రమపడకుండా కోట్లు ఆర్జిస్తు న్నాడు. అంతేకాదు, శ్రమపడి చదివినా....ఒక్కొక్క వ్యక్తి మెట్రిక్ కూడా ప్యాస్ కాలేకపోతున్నాడు. మరొకడు ఏ కష్టము లేకుండా, ఏశ్రమ పడకుండా ఎమ్.ఏ.,పి.హెచ్ డి. అయిపోతున్నాడు. ఒకడు గర్భములోనే మరణిస్తున్నాడు. మరొకడు వంద సంవత్సరాలు జీవిస్తున్నాడు. ఆయుస్సే ఉంటే....ఎన్నో గుళ్ళదెబ్బలు తినికూడా మానవుడు బ్రతక గలుగుతు న్నాడు. అది లేనివాడు చిన్నముల్లు గుచ్చుకుంటే చాలు మరణిస్తున్నాడు. ప్రాణము ఎప్పుడుపోయేదీ ఎవరూ చెప్పలేక పోతున్నారే?! 7-11-1966 సంవత్సరములో హత్యాకాండ జరిగే రోజున ఎన్నోగంటలు చాలామంది తుపాకిగుళ్ళ మధ్య నిలబడి ఉన్నారు. జగద్గురు శంకరాచార్య జ్యోతిష పీఠాధీశ్వర శ్రీకృష్ణ బోధాశ్రమ స్వామిజీ మహరాజ్ వారు స్థిరముగా అక్కడే కూర్చుని ఉండిపోయారు. ఆయనచుట్టూ తుపాకిగుళ్ళు మంచి తీవ్రముగా వర్షములా పడసాగాయి. అయినా ఆయనను ఏమీచేయ లేక పోయాయి. ప్రాణభయముతో పారిపోయేవారిని మాత్రము సంహ రించ గలిగాయి. స్థిరముగా అక్కడ ఆసీనులైన ఆయనను ఏమీ చేయ లేక పోయాయి. 1934లో బీహార్ భూకంపములో నాలుగు అంతస్తుల భవనాలు నేలమట్టమయ్యాయి. ఆ సమయాన కూడా ఎన్నో రోజులనుండి భోజనము లేనివారు, బాలురు, వృద్ధులు మరణించలేదు. కాని.... ఒక్క

రోజు భోజనము దొరకక్క ఆకలితో మరణించిన వా రున్నారు రైల్ ప్రమాదాలలోను, యాక్సిడెంట్ లవలన కూడా కొందఱు బ్రతికి బయట పడ్డారు. చనిపోయినవారు చనిపోతున్నారు. కాలో జగద్భక్షకః- ఆ కాలమే నిర్ణయిస్తుంది. ఏ ప్రాణి ఎంతవఱకూ ఈ భూమండలముపై ఉండాలో.... అంతవఱకే ఉంటాడు. అనంతరము వాయిదా వేయలేదు. వేసినా జరిగే దేమీ లేదు. అకాలమృత్యువు శాస్త్రాలలో ఎక్కడా చెప్పలేదు.

అకస్మిక దుర్ఘటనవలన కూడా జరిగే మృత్యువులు ఇవే! కాని.... సాధన, భజన, నిరంతర ధర్మకార్యాచరణ ద్వారా ఆయువు పెరుగుతుంది. సత్కర్మాచరణయందు మనస్సును లగ్నము చేయాలి. కాని నేడు....మానవుడు అధోగతి పాలౌతున్నాడు. అకాలమృత్యువుకు గుఱౌతున్నాడు. అస్తు!

'సంశయాత్మా వినశ్యతి' ఇది వాస్తవిక విషయము. అందుచేత.... సంశయము లేకుండా శ్రద్ధాభక్తులతో భగవంతుని స్మరించాలి. మనకు గత చరిత్రద్వారా తెలిసేదేమంటే ... పరమనాస్తికులుకూడా పక్కా ఆస్తికులౌతున్నారని! నిన్నటి ఘోర పాపాత్ముడు ఈనాడు పుణ్యాత్ముడుగా మారుతున్నాడు.

అందుచేత....మానవుడు జీవితాంతమువఱకూ ఒకేలా ఉండడు! సంశయాలు విడిచిపెట్టి భగవంతునియందు విశ్వాసము కలిగి ఉంటాడు!!

సద్గురు ప్రాప్తికి తీవ్రతమ ప్రయత్నము సాగాలి. దీనిని గుఱించి అన్వేషిస్తే.... అదే దొరుకుతుంది.

జీవికి పరమాత్మ స్వరూపము లభించడమే మోక్షము! అదే సచ్చిదానంద స్వరూపము!! అస్తు!

సర్వం శ్రీభగవ దార్పణ మస్తు!

—o—

## అ ధ్యా య ము - 3

### ఉ ప ని ష ద్వా ణి

# ఈశావాస్యోపనిషత్

### శాం తి పా ఠ మ్

**ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే॥**
**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే॥**

### వ్యా ఖ్యా న ము

ఆ సచ్చిదానంద ఘనుడు, పరబ్రహ్మ, పురుషోత్తముడు అన్ని విధాల....సదా, సర్వదా పరిపూర్ణుడు! ఈ జగత్తు ఆ పరబ్రహ్మతో పరిపూర్ణమై ఉన్నది. ఏందుచేతననగా ఈపూర్ణము ఆ పూర్ణ పురుషోత్తముని తో ఉన్పన్నమైనది. ఈ విధముగా పరబ్రహ్మము యొక్క పూర్ణత్వముతో జగత్తు పూర్ణమైనది. అందుచేతనే.... ఇది పరిపూర్ణమైనది. ఆ పూర్ణబ్రహ్మతో పూర్ణాన్ని తీసినప్పుడే పూర్ణము మిగులుతుంది.

త్రివిధములైన తాపములు శాంతించు గాక!

**ఈశావాస్యమిదం సర్వం యత్కించ జగత్యాం జగత్।**
**తేన త్యక్తేన భుంజీ థామాగృధః కస్యస్విద్ ధనమ్॥**

### వ్యాఖ్య

మానవులకు వేద భగవానుని పవిత్ర ఆదేశము ఏమనగా...."అఖిల విశ్వబ్రహ్మాండమందు- ఈ చరాచరాత్మకమైన జగత్తు, [illegible] వినేది....అంతా సర్వాధారుడు, సర్వనియంత, సర్వాధిపతి, సర్వశక్తి మంతుడు, సర్వజ్ఞుడు, సర్వకల్యాణ గుణ స్వరూపుడు అయిన పర మేశ్వరునితో వ్యాప్తమై ఉన్నది సదా....సర్వత్ర ఆతనితోనే పరిపూర్ణమై ఉన్నది. ఇందలి ఏ అంశము ఆతని లేకుండా లేదు [illegible]

ఈశ్వరుని నిరంతరము నీతో ఉంచుకొని; సదా....సర్వదా ఆయననే స్మరించుకుంటూ....నీ వీప్రపంచములో మమతను, ఆసక్తిని విడిచి పెట్టి; కేవలము కర్తవ్యపాలన కొఱకు విషయములను- యథావిధిగా భోగించి; విశ్వరూపుడైన ఈశ్వరుని పూజిస్తూ....కర్మలాచరించు! విషయభోగాలతో మనస్సును బంధించకు!! అప్పుడే నీకు శుభములు చేకుఱుతాయి. ఈ భోగపదార్థములు ఎవరివీకావు. మానవుడు పొరపాటున కూడా మమతను, ఆసక్తిని పెంచుకోకూడదు! ఇవన్నీ....ఇదంతా పరమేశ్వరునివే! జగదీశ్వరునిదే! ఆ కారణముచే ఈ ప్రభువు సంతోషము కొఱకు వీటిని ఉపయోగించు!

**కుర్వన్నే దేహ కర్మాణి జిజీ విషేచ్ఛత సమాః।**
**ఏవం త్వయి నాన్యథేతోఽస్తి న కర్మ లిప్యతే నరే॥**

## వ్యా ఖ్యా న ము

పూర్వమంత్రములో చెప్పిన విధముగా.... జగత్తునకు ఏకమాత్ర కర్త, ధర్తా, హర్త, సర్వశక్తిమంతుడు, సర్వమయుడు అగు పరమేశ్వరుని నిరంతరము స్మరిస్తూ..."సర్వము ఆప్రభువుదే"నని భావించి, ఆయన పూజకొఱకు శాస్త్రనియమితమైన కర్తవ్య కర్మలను ఆచరిస్తూ.... "వంద సంవత్సరములు జీవించాల"ని కోరుకో! ఆ విధముగా జీవితమును పరమేశ్వర ప్రాప్తికి సమర్పించు! శాస్త్రములందు చెప్పబడిన స్వకర్మాచరణ చేస్తూ....జీవయాత్ర సాగించు! పరమేశ్వర పూజ కొఱకే జీవితాన్ని వినియోగించు! నీ జీవితము, నీ శరీరము నీకోసము కాదు! భోగ, విలాసాలకు కాదు!! అని భావించి కర్మలాచరించిన....బంధనాలు ఉండవు. కర్మలాచరించాలి. కాని కర్మచూరుడవు కావాలి. అలా చేసిననాడు- కర్మబంధ విముక్తుడవు అవుతావు.

**అసుర్యా నామతే లోకా అంధేన తమసా౽వృతాః।**
**తాంస్తే ప్రేత్యాభి గచ్ఛంతి యేకేచాత్మ హనో జనాః॥**

**వ్యాఖ్య**

మానవశరీరము అన్య శరీరాలకన్న శ్రేష్ఠమైనది. పరమ దుర్లభ
మైనది కూడ! ఈ శరీరము భగవంతుని కృపావిశేషముచే సంసార సము
ద్రమును దాటడానికి లభించినది. అటువంటి శరీరమును పొందిన
మానవుడు తన కర్మ సమూహాన్ని ఈశ్వరపూజకు ఉపయోగించక-
కామోపభోగాలకు ఉపయోగిస్తూ.... అదే పరమధ్యేయముగా భావించి,
విషయాసక్తుడై, కామవశుడై, ఏదోవిధముగా.... కేవలము విషయ ప్రాప్తికై
యథేచ్ఛగా సంచరించువాడు ఆత్మహత్యకు లోనౌతున్నాడు. మానవుడు
ఇలా.... ఈవిధముగా పతన కారణమైన కామవాసనలకు లొంగి, జీవి
తాన్ని వ్యర్థపఱచరాదు. అలా వ్యర్థపఱచిన మానవుడు కర్మబంధములో
మఱింతగా చిక్కుకుంటాడు. ఈ కామభోగ పరాయణులైన వారు ఎవ
రైనా....గొప్పవారైనా, కీర్తి ఉన్నా; వైభవము, అధికారము ఉన్నా....
మరణించిన తరువాత కర్మల ఫలితముగా- కూకర, శూకర, కీటక,
పతంగాది విభిన్న శోక సంతాప పూర్ణమైన ఆసురీయోనులలో పడి; యాత
నలు పడతారు. భయంకర నరకములు అనుభవిస్తారు.

**అనేజదేకం మనసోజవీయో నైనద్దేవా అప్నువన్ పూర్వమర్షత్**
**తద్ధావతో౽న్యానత్యేతి తిష్ఠత్ తస్మిన్నపో మాతరిశ్వాదధాతి॥**

**వ్యాఖ్య**

ఆ ప్రభువు సర్వాంతర్యామి! సర్వశక్తిమంతుడు! అచలుడు!
మనస్సుకన్న అధికతీవ్రముగలవాడు! మనస్సుకన్న ముందు ఉండువాడు!
ఆదిస్వరూపుడు, జ్ఞానస్వరూపుడు, ఆదిదేవుడు! దేవతలు, మహర్షులు

ఆయనను పూర్ణముగా తెలిసికోలేరు. తీవ్రమైన బుద్ధి, మనస్సు, ఇంద్రియాలు, వాయువు మొదలైన దేవతలు పరమేశ్వరుని శక్తిని అను సరించే నిరంతరము పరుగెడుతారు. అయినా....పరమేశ్వరుడు నిత్యము అచలుడై వాటన్నిటికి దూరమై ఉంటాడు. ఇవేవి ఆయనను చేరలేవు. సరిహద్దు, సరిహద్దుజాడలేనిదే ఎలా తెలిసికొనుట!? కాని వాయువు మొదలైన దేవతలలో గల శక్తి- జలవర్షమును, ప్రకాశమును, ప్రాణిప్రాణధారణ మొదలైన కర్మలు చేయుటలో సమర్థత గలిగి ఉంటుంది. ఈ అచింత్య శక్తి పరమేశ్వరుని శక్తియొక్క అంశ! పర మేశ్వరుని సహాయము లేనిదే ఈ శక్తులేవీ....ఎందుకూ పనికిరావు!

**తదే జతి తన్నై జతి తద్ దూరే తద్ధంతికే.**
**తదంతరస్య సర్వస్యతదు సర్వస్యాస్య బాహ్యత॥**

**వ్యాఖ్య**

పరమేశ్వరుడు చలిస్తాడు. చలించడు. ఏకకాలములో పరస్పర విరోధభావ, గుణ, క్రియాదులలో ఉంటాడు. అతడే పరమేశ్వరుడు! ఇది అతని అంచిత్యశక్తియొక్క మహిమ! పరమేశ్వరుని గురించి మరో విధముగా కూడా చెప్పారు. భగవంతుడు తన దివ్య పరమధామమందు, లీలాధామమందు తన ప్రియభక్తులకు సుఖము కలిగించేందుకు ఆ ప్రాకృత సగుణ సాకార రూపములో ప్రత్యక్షమౌతాడు. లీలలు చేస్తూ ఉంటాడు. అదే ఆయన చలనావస్థ! అదే విధముగా....ఆ ప్రభువు శ్రద్ధలేని, ప్రేమ రహితులైన మానవులకు ఎప్పుడూ దర్శనమివ్వడు! ఆ కారణము చేత వారికి దూరముగా ఉంటాడు. కాని....ప్రేమికులకు, భక్తులకు దగ్గరలో ఉండి; వారిపిలుపు విని, క్షణములో ప్రత్యక్షమౌతాడు. వారికి సమీపములో ఉంటాడు. అంతేకాదు.... ఆ ప్రభువు సదా.... సర్వత్ర పరిపూర్ణుడై ఉంటాడు. కొందరికి సుదూరుడు! మరికొందరికి సమీపవర్తి! ఇందుకు

కారణము లేకపోలేదు. అతడు సర్వాంతర్యామి కావడమే! ఆ ప్రభువు లేని
చోటులేదు. అజ్ఞానులు ఈ విషయము తెలిసికోలేరు! వారికా ప్రభువు
కడుదూరుడు!! వస్తుతః ... ఆయన ఈ సమస్త జగత్తునకు పరమ ఆధా
రుడు! పరమకారణుడు! అందుచేత ... బయట, లోపల అంతటా ఆ
ప్రభువు-నిండి ఉన్నాడు.

వస్తు సర్వాణి భూతాన్యాత్మన్యే వా నుపశ్యతి,
సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే॥

వ్యాఖ్య

ఈ విధముగా....ఏ మానవుడు సర్వప్రాణికోటిని- సర్వాధారుడైన
పరబ్రహ్మ పురుషోత్తము, పరమాత్మయందు చూస్తాడో.... అతడు ఏ
విధముగా ఈర్ష్యాద్వేషాలతో ఉండగలడు? ఉండలేడు! అతడు నిరంత
రము తన పరమ ప్రభువునే దర్శిస్తూ....మనసుననే అందరికీ నమస్క
రిస్తాడు. అంతేకాదు.... అందరిని అన్ని విధాల సేవిస్తుంటాడు. అందు
లోనే తనకు ఆనందము, సుఖము లభిస్తుందని భావిస్తాడు.

అనగా...సర్వప్రాణులయందు భగవంతుని చూస్తూ.... నిరంతరము
ఇతరులకొఱకు ఏ మానవుడు తనసర్వస్వమును సమర్పించుకుంటాడో....
అట్టి మానవుడు పొందే ఆనందము, సంతోషము, సుఖము, తృప్తి చెప్ప
దానికి అలవికాదు!

యస్మిన్ సర్వాణి భూతాన్యాత్మైవా భూత్ విజానతః।
తత్ర కో మోహః కః శోక ఏకత్వమా నుపశ్యతః॥

వ్యాఖ్య

ఈ విధముగా మానవుడు పరమాత్మను [illegible]-
ఆతనికి సర్వే సర్వత్ర భగవద్దృష్టి కలుగుతుంది. [illegible] ఆ భగ

వానుడు గోచరిస్తాడు. ఆ సమయాన అతని అంతఃకరణయందు శోక మోహాది వికారాలు ఎలా ఉంటాయి గనుక? ఉండవు! ఆనందమగ్నుడై ఉంటాడు. శోక, మోహాది వికారాలు దరి చేరవు! ప్రజలకు ఏదో విధముగా ఏదో ఒకటి చేస్తూ ఉంటాడు. వాస్తవానికి అతడు తన భగవంతునియందు క్రీడిస్తూ ఉంటాడు. అతనికి- ప్రభువు, ప్రభులీలలు తప్ప ఇంకేమీ ఉండవు!

అనగా....సంసార సాగరములో ఉంటూకూడా- మానవుడు ప్రభువును తెలిసికొని, ఆ ప్రభువు సేవచేస్తూ, ప్రభులీలలు చూస్తూ, ప్రభువుయందే మనస్సు లగ్నముచేసి, ప్రభువే తన సర్వస్వమని మసలుకున్ననాడు ధన్యుడే! పుణ్యాత్ముడే!! భగవత్ప్రసాదితమైన ఈ మానవజన్మ సర్వోత్కృష్టమైనదని తెలిసికొని, దానిని సద్వినియోగము చేసికొన్ననాడు....వాడు ప్రభువుయందే క్రీడిస్తూ ఉండగలడు.

**సపర్యగాచ్ఛుక్రమ కాయమ వ్రణ మస్నావిరం శుద్ధమ పాపవిద్ధమ్।**
**కవిర్మనీషీ పరిభూః స్వయంభూర్యా థాతథ్యతో**
**ఽర్థాన్ వ్యదధాచ్ఛాశ్వతీభ్యః సమాభ్యః॥**

## వ్యాఖ్య

పైన వర్ణించిన దానిని అనుసరించి- పరమేశ్వరుని అంతటా చూచే మహాపురుషోత్తముడు- ఆ పరబ్రహ్మ, పురుషోత్తముడు అగు సర్వేశ్వరుని పొందగలడు. ఆ పరబ్రహ్మ శుభాశుభ కర్మ జనిత ప్రాకృత సూక్ష్మ దేహుడు! పాంచభౌతికమైన అస్థి, శిరా, మాంసాదిమయమై, షడ్ వికార యుక్తమైన స్థూలదేహ రహితుడు! ఛిద్రరహితుడు, దివ్యశుద్ధ సచ్చిదానందఘనుడు, క్రాంతిదర్శి, సర్వద్రష్ట, అందరికీ తెలిసినవాడు. అందరిని తన అధీనములో ఉంచుకొన్న సర్వాధిపతిగాని కర్మపరవశుడుకాడు.

స్వేచ్ఛగా ప్రత్యక్షమౌతాడు. సనాతనకాలమునుండి ప్రాణులందరికీ వారి వారి కర్మానుసారము- సమస్త పదార్థాలను రచించి, విభజించే వ్యవస్థను చేస్తూ వస్తున్నాడు.

**అంధం తమః ప్రవిశంతియేఽవిద్యా ముపాసతే।**

**తతో భూయ ఇవ తేయ ఉ విద్యాయా రతాః॥**

## వ్యాఖ్య

ఏ మానవుడు భోగాసక్తుడై వాటిని పొందేందుకు సాధనరూపమైన అవిద్యను- వివిధ విధములైన కర్మానుష్ఠానము చేస్తూ.... ఆ కర్మ ఫల స్వరూపమైన అజ్ఞానాందకారముతో పరిపూర్ణమైన వివిధ యోనులు, భోగాలు పొందుతాడో....అట్టివాడు మానవజన్మ చరమ, పరమ లక్ష్యమైన శ్రీపరమేశ్వరుని పొందలేక....నిరంతరము జన్మమృత్యురూపమైనసంసార ప్రవాహములోపడి, వివిధ తాపాలతో సంతప్తుడౌతాడు.

అంతఃకరణశుద్ధికి ఏ మానవుడు అభిమాన రహితుడై కర్మానుష్ఠానము చేయడో; వివేక, వైరాగ్యాది జ్ఞానసముపార్జన చేయక....ప్రాథమిక సాధనలనే చేస్తూ ఉంటాడో; కేవలము శాస్త్రాలను చదివి, విని, తనలో విద్య, జ్ఞానము, ఉన్నదని మిథ్యారోపము ఆరోపించుకుంటూ.... జ్ఞానాభిమానియై గర్విస్తూ ఉంటాడో; అటువంటి మిథ్యాజ్ఞాని- తానే జ్ఞానియని భావించి, "నాకు ఏకర్తవ్యము లేదు" అని భావిస్తూ....కర్తవ్య కర్మలను విడిచిపెట్టి, ఇంద్రియాధీనుడై ...శాస్త్రవిధికి వ్యతిరేకముగా తనకు తోచినట్లు కార్యాచరణ సాగిస్తాడు. దానితో వాడు సకామ భావముతో కర్మలాచరించే విషయాసక్త మనుష్యునికన్న కూడా అధికతర అంధకారములో పడి-పశు, పక్షి, శూకర, కూకర మొదలైన నీచయోనులందుపడి, రౌరవ కుంభీపాకాది ఘోరనరకములు పొందుతాడు. అందుచేత శాస్త్రమందలి యథార్థ తాత్పర్యమును గ్రహించి, జ్ఞానకర్మను అనుష్ఠానము చేసి; సర్వోత్తమ మార్గాన్ని అనుసరించాలి.

**అన్యదేవాహు ర్విద్యా యాన్య దాహు రవిద్యయా।**
**ఇతి శుశ్రుమ ధీరాణాం యే న స్తద్ విచచక్షిరే॥**

## వ్యాఖ్య

సర్వోత్తమ ఫలప్రాప్తినిచ్చు జ్ఞానముయొక్క యథార్థ స్వరూపము, నిత్యానిత్య వస్తు వివేకము; క్షణభంగురమైన, వినాశకరమైన, అనిత్యమైన, ఐహిక లౌకికమైన మరియు పార లౌకికమైన భోగ సామగ్రులు, వాటికి కావలసిన సాధనలయందు- పూర్ణవైరక్తి; సంయమ పూర్ణమైన పవిత్ర జీవితము, ఏకమాత్ర సచ్చిదానంద ఘనాఘనుడైన పూర్ణబ్రహ్మ చింతనలో అఖండ సంలగ్నత కలిగియుండండి! ఇవన్నియు యథార్థ జ్ఞాన అనుష్ఠానమువలన ప్రాప్తించును. పరబ్రహ్మ పురుషోత్తముడైన ఆ సర్వేశ్వరుని యథార్థజ్ఞానము వలననే ఈ సర్వోత్తమ ఫలము లభించుచున్నది. జ్ఞానాభిమానమందు రతుడై, స్వేచ్ఛాచారుడై- మానవుడు, దుర్గతిని పొందుతున్నాడు. జ్ఞాని సర్వదా సద్గతినే పొందుతున్నాడు.

అదేవిధముగా....సర్వోత్తమ ఫలప్రాప్తిని కలిగించు కర్మస్వరూపము- కర్మయందు, కర్తయందు; కర్తయొక్క అభిమాన అభావము, రాగ ద్వేష ఫలకామములలోటు, వర్ణాశ్రమము మరియు పరిస్థితులకు అనురూపముగా కేవలము భగవత్సేవాభావముతో, శ్రద్ధతో శాస్త్రవిహిత కర్మలను ఆచరించుట; దుర్గుణములు, దురాచారములు మొదలుగాగల సమస్త వికారములను విడిచిననాడే ... సాధకుడు మృత్యుమయ సంసార సాగరాన్నుండి తరించగలడు. సకామభావముతో- కర్మలాచరించిన పునర్జన్మ రూపఫలమును పొందవలెను.

**విద్యాంచా విద్యాంచ యస్తద్ వేదోభయ సహ।**
**అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయా మృతమశ్నుతే॥**

## వ్యాఖ్య

కర్మ, అకర్మ; ఈ రెండింటి వాస్తవిక రహస్యములు తెలిసికొనుటలో గొప్పగొప్ప విద్వాంసులు కూడా పొరపాటుపడుచున్నారు. ఆ కారణముచేత కర్మరహస్యము తెలియని జ్ఞానాభిమాని కర్మబ్రహ్మజ్ఞానము బాధకమని భావించి తమ వర్ణాశ్రమోచిత కర్తవ్యకర్మలను త్యజిస్తున్నారు. కాని.... ఈ విధమైన త్యాగమువలన....వారికి త్యాగమునందలి యథార్థ ఫలము- కర్మబంధన విముక్తి కలుగదు. అదేవిధముగా జ్ఞానతత్వమును తెలియక మానవుడు తనను జ్ఞానిగా భావించి- తనే ఉన్నతుడనని గర్విస్తున్నాడు. ఆ కారణముచే వారు లేదా తను పుణ్య, పాపములతో నిరప్తుడై ఇచ్ఛానుసారముగా కర్మాచరణయందు ప్రవృత్తుడౌతున్నాడు. లేదా కర్మలయందు భారరూపుడై వాటిని విడిచిపెడుతున్నాడు. దానితో సోమరి అయి నిద్రా-ప్రమాదావస్థలోపడి,తన దుర్లభమానవ జీవనోపయోగమైన అమూల్య సమయమును నాశనము చేసికొంటున్నాడు.

ఈ రెండు విధములైన అస్థిరాలనుండి మానవుడు బయటపడాలంటే.... ఒకే ఒక ఉపాయము. ఏమది? కర్మజ్ఞాన రహస్యములు తెలిసికొనుట వాటిని యథాయోగ్యముగా అనుష్ఠించుట. మానవుడు ఈ తత్త్వములను ఒకేసారి బాగుగా అర్థము చేసికొని, తన వర్ణాశ్రమ పరిస్థితులకు అనురూపముగా శాస్త్రవిహిత కర్మలను త్యజించక.... రాగ, ద్వేష ఫలకామరహితుడై.... యథాయోగ్యముగా కర్మలాచరించాలి. ఆవిధముగా వ్యవహరించిన నాడు జీవితమును సుఖమయము చేసికోగలడు. సుఖజీవి దుర్గుణములకు దూరుడై, వికార రహితుడై, నిర్మలుడై, భగవత్కృపాపాత్రుడై, మృత్యుమయ ప్రపంచమునుండి విముక్తి నొందుతాడు. కర్మ సాధనతో వివేక-వైరాగ్య సంపన్నుడై నిరంతరము బ్రహ్మవిచార రూప జ్ఞానాభ్యాసము చేస్తూ.... శ్రీ పరమేశ్వరుని యథార్థజ్ఞానాన్ని తెలిసికొంటాడు. అలా తెలిసికొన్ననాడు పరమేశ్వరుని పొందగలడు.

అంధం తమః ప్రవిశంతియేఽ సంభూతి ముపాసతే,
తతోభూయ ఇవతే తమోయ ఉ సంభూత్యాంరతాః॥

వ్యాఖ్య

ఏ మానవుడు వినాశకరములైన స్త్రీ, పుత్ర, ధన, మాన, కీర్తి, అధికారాది లోకసంబంధమైన భోగసామగ్రియందు ఆసక్తుడై, వాటివలన సుఖమున్నదని భావించి....వాటిని సంపాదిస్తూ, సేవిస్తూ, భోగిస్తూ నిరంతరము వాటియందే సంలగ్నమై ఉంటూ....ఈ భోగ సామగ్రి ప్రాప్తికి, సంరక్షణకు, వాటి వృద్ధికి- విభిన్న దేవతలను, పితరులను, మనుష్యులను ఉపాసిస్తూ, ఆరాధిస్తూ, స్వయముగా జనన, మరణ రూపమైన చక్రములో పడి; సుఖ, దుఃఖమయమైన సంసారయాత్ర సాగిస్తాడో! అతడు ఎన్నటికినీ మోక్షమును అందుకోలేడు. అనవసరమైన వస్తువును జాగ్రత్తపరచుట, బాధపడుట అవివేకి లక్షణము. అవివేకులు వారి వారి ఉపాసనల దృష్ట్యా విభిన్న దేవలోకాలలో, విభిన్న భోగయోనులలో సంచరిస్తూ ఉంటారు. అది వారి అజ్ఞాన రూపమైన, ఘోర అంధకారములో ప్రవేశించడమే. అనగా నువ్వు చూసేది నశించేది. చూడలేని అలౌకిక శక్తి, దివ్యజ్యోతి ఒకటి ఉన్నది. దానిని చూడగలిగితే ధన్యుడవు. అందుకు సాధన కావాలి, నియమము అవసరము. నిష్ఠ ఉండి తీరాలి. అంతేగాని భోగ వస్తుప్రాప్తికి నిరంతరము కృషి సలిపి జీవితాన్ని వృథావేయకు. సర్వోత్కృష్టమైన ఈ మానవజన్మ సద్వినియోగము కావాలంటే....శాస్త్రవిహిత కర్మలాచరించుచు, భగవానుని దివ్యగుణగానము చేయుచు, తత్వమును తెలిసికొని రహస్యములను గ్రహించు, శ్రద్ధాసక్తులతో భజించు. మిథ్యాభిమానివి కాకుము. కర్తవ్య నిర్వహణ సాగింపుము. దేవపూజ, గురుజన సన్మానము చేయుము. వాగ్జాలముతో ఇతరులను మోసముచేసి ధనార్జన చేయకు, దురాచారము విడిపెట్టి కూకర, శూకర మొదలైన నీచయోనులలో జన్మించకు. రౌరవాది నరకాలు అనుభవించకు. అంతేకాదు....వినాశ

కాలదేవతలను ఉపాసించకు. శాస్త్రమందు చెప్పబడిన యథార్థవిషయములు గ్రహించి అందుకు సాధన సాగించి ముక్తికి ప్రయత్నించు, "శస్త్రవత్" శాస్త్రము. అది విధిస్తుంది, దాన్ని అనుసరించు.

**అన్యదేవాహుః సంభవాదన్య దాహురసంభవాత్,**
**ఇతి శుశ్రుమ ధీరాణాం యేన స్తద్ విచచక్షిరే॥**

సంసార సాగరమునుండి విముక్తుడౌతాడు. నిష్కామ ఉపాసనతో పరాత్పరుని సేవించిననాడు....అమృతరూపుడై పరమేశ్వరుని ప్రత్యక్షము చేసికోగలడు. ఆదే ధ్యేయము! అదే లక్ష్యము! అదే గమ్యము! అదే తరుణోపాయము!!

**హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపి హితం ముఖమ్,**
**తత్వం పూషన్నపావృణు సత్యధర్మాయ దృష్టయే॥**

భగవంతుని భక్తుడు ప్రార్థించాలి. సేవించాలి. పూజించాలి. ఓ భగవంతుడా! నీవు అఖిల బ్రహ్మాండములను పోషించువాడవు. నీవలననే అందరు పుష్టులౌతున్నారు. నీ భక్తి సత్య ధర్మము. నేను నిన్ను సేవిస్తున్నాను. పూజిస్తున్నాను. నాకు పుష్టిని ప్రసాదించు. నా మనోరథాలు ఈడేర్చు. నీవు దివ్య శ్రీముఖుడవు. సచ్చిదానంద స్వరూపుడవు. ప్రకాశమయుడవు. సూర్యమండలాన్ని ప్రకాశము చేయగలవాడవు. జ్యోతిర్మయుడవు. నేను నీదర్శనము కావాలని వాంచిస్తున్నాను. నీ-నా మధ్యగల ఆవరణలను దూరముచేయి. ప్రతిబంధకాలు లేకుండాచేయి. వాటినన్నిటిని రూపుమాపుము. నీసచ్చిదానంద స్వరూపము నాకు కనబరచుము.

**పూషన్నేకర్షే యమ సూర్య ప్రజాపత్య వ్యూహ రశ్మిన్**
**సమూహ**

**తేజో యత్తేరూపం కల్యాణతమం తత్తే పశ్యామియోఽ**
**సావ సౌపురుషః సోఽహమస్మి॥**

## వ్యాఖ్య

భగవంతుడా! నీవు నీ సహజ దయతో భక్తుల భక్తిసాధనతో పుష్టిని ప్రదానముచేసి వారిని పోషిస్తూ ఉంటావు. నీవు సమస్తజ్ఞానులకు అగ్రగణ్యుడవు, పరమజ్ఞాన స్వరూపుడవు. నీ భక్తులకు నీ స్వరూప మందలి యథార్థజ్ఞానమును తెలుపుతావు. నీవు నియంతవు. నియంత్రణ చేసేవాడవు. పాలకుడవు. నీవు భక్తులకు, జ్ఞానులకు, మహాపురుషులకు లక్ష్యము. భక్తవత్సలుడవు. ప్రజాపతికికూడా నీవు ప్రియుడవు. ఓ ప్రభూ! నీవు ఈ సూర్యమండలమునూ, తత్తరశ్మిని ఏకత్వము చేసి నీలో లీనము చేసికో. ఈ ఉగ్రతేజస్సును నీతో లీనము చేసికో. నాకు నీ దివ్యస్వరూపమును చూపు. ఇప్పుడే నేను నీదయ వలన నీ సౌందర్యాన్ని చూడ గలుగు తున్నాను. మాధుర్యనిధిని సందర్శించ గలుగుచున్నాను. పరమకల్యాణమయ సచ్చిదానంద స్వరూపమును దర్శించలుగుచున్నాను. నిన్ను తెలిసికోగలుగుచున్నాను. పరమపురుషుడైన ఈ సూర్యునకు సమస్త విశ్వానికి నీవు ఆత్మవు. అదే నాకుకూడా ఆత్మ. అందుచేత నేను కూడ నీవే!

**అన్యదేవాహుః సంభవాదన్య దాహుర సంభవాత్,**
**ఇతి శుశ్రుమ ధీరాణాం యే న స్తద్ విచ చక్షిరే॥**

## వ్యాఖ్య

ఈ శ్లోకమందు నాశనరహితుడైన బ్రహ్మయొక్క ఉపాసనా విషయమైన యథార్థ స్వరూపము తెలుపుచున్నాడు. పరబ్రహ్మ, పురుషోత్తముడు, భగవానుడు, సర్వశక్తి సమానుడు, సర్వజ్ఞుడు, సర్వాధారుడు, సర్వమయుడు, సమస్తజగత్తుకు కర్త, ధర్మ, హర్త, నిత్య అవినాశి అని తెలిసికోవాలి, భక్తి, శ్రద్ధ, ప్రేమపూరిత హృదయముతో నిత్యము "నిరంతరము" ఆ ప్రభువు దివ్యగుణగణమయమైన, సచ్చిదానంద ఘనస్వరూపుని శ్రవణ, కీర్తన, స్మరణాదులు చేస్తూ ఉండాలి. ఈ విధమైన ఉపాసనతో ఉపాసకుడు శీఘ్రముగా అవినాశీ, పరబ్రహ్మ, పురుషోత్తముని పొందగలడు.

మానవుడు దేవ, పితర, బ్రాహ్మణ, మాతాపితరులను, ఆచార్యులను, జ్ఞానులను, మహాపురుషులను సేవిస్తూ....పూజిస్తూ, అది తమ కర్తవ్యముగా భావిస్తూ ఉండాలి. అది భగవదాజ్ఞగా గుర్తించాలి. అది ప్రభు సేవగా భావించాలి. ఈ విధముగా నిష్కామభావముతో దేవ, పితర, మనుష్యాదులను సేవిస్తూ, అంతఃకరణను శుద్ధిపఱచుకోవాలి. అప్పుడే భగవద్దర్శనము అవుతుంది. అయిననాడు.... ఆ జీవికి మృత్యుమయ సంసార సాగరమునుండి విముక్తి కలుగుతుంది! పునర్జన్మ ఉండదు!! నిరంతరము అందుకు సాధన చేయాలి. విహిత కర్మలాచరించాలి. మానవధర్మము నిర్వర్తించాలి.

**సంభూతించ వినాశంచ యస్తద్ వేదో భయ సహ**
**వినాశేన మృత్యుం తీర్త్వా సంభూత్యా మృత మస్నుతే॥**

**వ్యాఖ్య**

పరబ్రహ్మ పురుషోత్తముడు, నిత్యుడు; సర్వాధారుడు, నిర్గుణుడు, సగుణుడు అని భావించవలెను. దేవ, పితర, మానవాది జన్మలు, భోగసామగ్రి, ఇవన్నీ వినాశకరమైనవి, క్షణభంగురమైనవి. జనన మరణములకు హేతుభూతములు, దుఃఖకారణములు. కాని.... వీని యందలి స్ఫూర్తి, శక్తి, భగవత్స్వరూపములు. భగవంతుని విశ్వచక్రము సక్రమముగా తిరగడానికి ఇవన్నీ యథావిధిగా యుండవలెను. అందుచే వీనిని సేవించాలి! పూజించాలి!! శాస్త్రవిహిత కర్మలాచరించాలి!!! శాస్త్రము భగవానుని వాణి. మానవుడు ఐహిక, పారలౌకిక, దేవ, పితర లోకాలందలి భోగలయందు ఆసక్తుడుకాక.... కామము, మమత విడిచిపెట్టి యథాయోగ్యముగా శాస్త్రవిహిత సేవాపూజాదులు ఆచరించవలెను. అప్పుడు ఆ మానవుని జీవనయాత్ర సుఖముగా జరుగుతుంది. అట్టివారికి అంతఃకరణ శుద్ధమవ్వాలి. [illegible] వికారాలను నాశనము చేసికోవాలి. [illegible] విముక్తి కృప ఉన్నవాడు....మృత్యుమయ సంసార సాగరమునుండి [illegible] దాటాడు, నిష్కామ ఉపాసనతో పరాత్పరుని సేవించినవాడు ... అమృత

రూపుడై పరమేశ్వరుని ప్రత్యక్షము చేసికోగలడు. అదే ధ్యేయము! అదే లక్ష్యము! అదే గమ్యము! అదే తరుణోపాయము!!

వాయురనిల మమృతమథేదం భస్మాంతం శరీరమ్,

**ఓం క్రతోస్మర కృతస్మర క్రతోస్మర కృతస్మర॥**

## వ్యాఖ్య

పరమధామము వైపు ప్రయాణము సాగించే ఆ సాధకుడు తన ప్రాణ, ఇంద్రియ శరీరములను తనకు భిన్నముగా భావించి, వాటన్నింటిని తన ఉపాదానతత్త్వముతో నిరంతరము విలీనముచేసి; సూక్ష్మ, స్థూల శరీరమును సర్వథా విఘటన చేస్తాడు. అందుచే ప్రాణాది సమిష్టివాయువు అందు ప్రవిష్టుడు కావలెను. స్థూల శరీరము కాలి భస్మమై పోతుంది. తిరిగి అది తన ఆరాధ్యదేవుని, పరబ్రహ్మను పురుషోత్తముని ప్రార్థిస్తుంది. "ఓ యజ్ఞమయుడా! సచ్చిదానంద విజ్ఞాన స్వరూపా! పరమేశ్వరా! నీవు నీ నిజభక్తుడనై నన్ను, నా పనులను, స్మరించు నన్ను, నా ద్వారా ఆచరించిన భక్తి రూపకార్యాచరణలను స్మరించు. నీవు స్వయముగా చెప్పావు ఏమని!? 'అహం స్మరామి మద్భక్తం నయామి పరమాంగతిమ్' అని అనగా "నేను నా భక్తుణ్ణి స్మరిస్తాను. అతనిని పరమగతికి చేరుస్తా" నని నా సేవను స్వీకరిస్తాను. ఎందుచేతనసగా అదే సర్వశ్రేష్ఠమైన గతి!

అందుచేత....అదే అభిప్రాయముతో భక్తుడు ఇక్కడ మరల ఇలా అంటున్నాడు. 'భగవంతుడా! నీవు నన్ను నా కర్మలను చూడు. చివరిదశలో నేను నీ స్మరణయందే లగ్నమై ఉంటాను. అందుకు తగ్గట్టు నన్ను నడుపు. నీ సేవకొఱకు అతిత్వరతో నిన్ను చేరుకుంటాను. అందుకు కావలసిన సాధన సంపత్తిని సమకూర్చు ప్రభూ!

ఈ విధముగా తన ఆరాధ్యదేవుని, పరబ్రహ్మను, పురుషోత్తముని ప్రార్థించి; అందుకు సాధకుడై, అర్చనాది మార్గాల ద్వారా పరమధామము చేరుకునేందుకు అగ్నిని ఈ క్రింది విధముగా ప్రార్థిస్తున్నాడు.

అగ్నేనయ సుపథారయే అస్మాన్ విశ్వాని దేవ
వయనాని విద్వాన్।

యుయోధ్యస్మ జ్జుహురాణ మేనో భూయిష్ఠాంతే
నమఉక్తిం విధేమ॥

వ్యాఖ్య

అగ్నీ! అధిష్ఠానదేవతా! మమ్ము పరమ ఘనస్వరూపుడైన పరమేశ్వరుని సేవచేయుటకు సుందర, శుభమార్గాన తీసికొనివెళ్ళు. ఓ దేవ! నీవు మా సమస్తకర్మలు ఎరుగుదువు. అందుచేత మాకు ఈ మార్గమునకు ప్రతిబంధకాలైన పాపకార్యాలకు దూరముగా ఉంచు. దూరముచేయి. నీకు మాటి-మాటికి నమస్కరిస్తున్నాను.

అని....సాధకుడు ఇంకా ఇలా పలుకుతున్నాడు- ఓ అగ్నిదేవతా! నేను పరమప్రభువైన నిన్ను చేరుకొని నీ సేవ చేయాలని ఉన్నది. అందుచేత నీవు వెంటనే నన్ను పరమసుందర మంగళమయ ఉత్తరాయణ మార్గము గుండా పరంధామము చేర్చు. భగవద్భక్తితో గడిపాను. ఆ పరమప్రభువును దర్శించగలిగాను. నామోచ్చారణ చేయగలిగాను. నన్ను నీ సన్నిధికి చేర్చుకో. నేను నీకు అనేక నమస్కారములు చేస్తున్నాను.

యజుర్వేదాయ ఈశావాస్యోపనిషద్ సమాప్తమ్!

ఓం పూర్ణమదః పూర్ణమిదః పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే॥
ఓం శాంతిః ఓం శాంతిః ఓం శాంతిః

# మానవ ధర్మశాస్త్రము

వెల : Rs. 18.00

మానవులు- నిత్యజీవితములో చేయవలసిన పనులు, చేయకూడని పనులు మరియు సుఖ-సంతోషముల నొసంగే- 'దివ్య స్తోత్రములు'

---

# యోగశాస్త్రం

## యోగశాస్త్ర రహస్య విజ్ఞాన గ్రంథము

ప్రాథమిక వ్యాయామాలు, సూర్యనమస్కారాలు, షట్క్రియలు, యోగాసనములు, ప్రాణాయామమువంటి అభ్యాసవిధులు మరియు యోగ వైద్య ప్రక్రియలు!

వెల : Rs. 22.00

---

అష్టైశ్వర్యప్రదాయని...



# శ్రీ మహాలక్ష్మి
## నిత్యపూజా విధానము

వెల : Rs. 6.00

లక్ష్మీ కటాక్ష లబ్ధి-తద్వారా ధనార్జనా చేకూరునట్టి విధానములతో రూపొందించబడినది.

---

# ఆయుర్వేదమ్

## (భారతీయ వైద్యశాస్త్రము)

సిద్ధమకరధ్వజాది ఔషధాలకు- అనుపానములు! జలుబు, జ్వరాది సాధారణ వ్యాధులకు- చిట్కాలు!! అల్లము, తేనె, నిమ్మవంటి ఆహార పదార్థాలతో- చికిత్సలు!!!

వెల : Rs. 18.00

---

ప్రైవాటిలో.... కావలసిన పుస్తకముల ధరను-"జనప్రియ పబ్లికేషన్స్, తెనాలి-522 201" కి M.O. చేయగలరు.

Cont.... 4rd Cover